# కులం పునాదులు

3001/81

18/7/81

★

కె. పద్మారావు

★

ప్రచురణ

నెల్లూరు జిల్లా హేతువాద సంఘం

# కులం పునాదులు

ప్రథమ ముద్రణ :
జనవరి, 1981.

ప్రతులు : 2000

నెల్లూరుజిల్లా హేతువాద
సంఘ ప్రచురణలు - 4

301.44
PAD

ప్రతులకు :

జె. మార్కండేయులు
నెల్లూరుజిల్లా హేతువాద సంఘ కార్యదర్శి
21-542 భాష్యకార్లవారివీధి, పెద్దబజారు
నెల్లూరు - 524 001.

Acc No-3292

కె. పద్మారావు
ఆంధ్రోపన్యాసకులు
ఎస్. వి. ఎస్. సంస్కృత కళాశాల
పొన్నూరు - 522 124.
గుంటూరు జిల్లా.

ముద్రణ :
చంద్రశేఖర ఆర్టు ప్రింటర్స్,
తెనాలి. ఫోన్ నెం. 784

వెల : రూ. 8-00

# మా మాట

హేతువాద ఉద్యమం శాస్త్రీయ ఆలోచనాన్ని పెంపొందిస్తుంది. మతతత్వాన్నీ, కులతత్వాన్నీ, సంప్రదాయ దురాచారాల్నీ, మూఢనమ్మకాల్నీ అస్పృశ్యతా జాడ్యాన్నీ నిర్మూలించడానికి కృషిచేస్తుంది. ఆ ప్రయత్నం లోనే మేము ఈ 'కులం పునాదులు' అనే పుస్తకాన్ని ప్రచురిస్తున్నాం. ఈ "కులంపునాదులు" పరిశోధనాత్మకమైన గ్రంథం, చారిత్రక, సాంస్కృతిక అధ్యయనం దీనికి పునాది. అందుకే ఈ పుస్తకం వ్రాయడంలో శ్రీ పద్మారావుగారి కృషి అత్యంత ప్రశంసనీయం.

శ్రీ పద్మారావుగారు ఆంధ్రదేశంలో హేతువాద ఉద్యమకారుల్లో గొప్ప వక్త. వీరు తమ ఉపన్యాసాలద్వారా జనంలో సామాజిక చైతన్యాన్ని రేకెత్తించడంకోసం అవిరళ కృషి చేస్తున్నారు. వీరు తమ కవితా సంకలనం 'జనగీతం' ద్వారా 'కష్టజీవుల కవిగా' మనందరికీ సుపరిచితులే. అలాంటి రచయిత, ఉద్యమకారుని పుస్తకాన్ని మేము ప్రచురిస్తున్నందుకు మాకెంతో ఆనందంగా వుంది.

పుస్తకవిస్తరణ భీతిచే ఈ గ్రంథంలోని 'జాషువా – కుల పోరాటం' అనే భాగాన్ని ప్రచురించలేకపోతిమి. ఆ భాగం ఈ వరుసలో వస్తున్న తదుపరి పుస్తకంలో ప్రచురించబడుతుంది.

ఈ పుస్తక ప్రచురణకు సహకరించిన మిత్రులు శ్రీ పి. భీమన్న, డా॥ పి. జయప్రద, శ్రీ యన్. వెంకటేశ్వర్లు, రాజేంద్రనగర్ హేతువాద మిత్రులు, శ్రీ టి. సుకుమార్‌రెడ్డి, శ్రీ యమ్. సాయిప్రకాశరావు, శ్రీ వి. వెంకటేశ్వరరావు, శ్రీహరికోట హేతువాద మిత్రులు, శ్రీ సి.హెచ్. రాధా కృష్ణమూర్తి, డా॥ పి. మధుసూదనశాస్త్రి, డా॥ కె. పురుషోత్తం, శ్రీ వి. చెంచయ్య, డా॥ పి. మదన్‌మోహన్‌రావు, శ్రీ కె. హనుమంతరావు, (నరసరావుపేట) నరసరావుపేట హేతువాదమిత్రులు, శ్రీ టి. మాధవరావు (విజయవాడ), శ్రీ గార్లపాటి కోటేశ్వరరావు (పొన్నూరు), గార్లకు మా కృతజ్ఞతలు.

ఈ పుస్తకాన్ని అతితక్కువ కాలంలో ఎంతోచక్కగా అలంకరించి అందించిన చంద్రశేఖర ఆర్టు ప్రింటర్స్, తెనాలి వారికి కృతజ్ఞతాభి వందనములు.

నెల్లూరు జిల్లా హేతువాద సంఘం.

# విషయ సూచిక

# ఈ గ్రంథరచనకు ఉపకరించిన గ్రంథములు.


1. Tribe Caste and Religion - Edited by Romesh Thapar.
2. Ancient India R. C. Majumdar
3. Lokayata - Debiprasad Chattopadhyaya.
4. History of India - Vidyadhara Mahajan.
5· Indian History and Culture - B. S. L. Hanumantha Rao.
K. Basaveswara Rao.
6 An Introduction to the study of Indian History
D D. Kosambi
7. Thus Spoke Ambedkar - Edited by Bhagwan Das.
8. ఋగ్వేదఆర్యులు – రాహుల్ సాంకృత్యాయన్
9. కళలు - శాస్త్రీయ విజ్ఞానము – కొడవటిగంటి కుటుంబరావు.
10. బ్రాహ్మణులు – కొడవటిగంటి కుటుంబరావు.
11. ఋగ్వేద సంహిత
12. సీత జోస్యము – నార్ల వెంకటేశ్వరరావు.
13. భారతదేశ చరిత్ర-సంస్కృతి – B. S. L హనుమంతరావు
(తెలుగు అకాడమి)
14. నాస్తికత్వం - నాస్తితత్వం – రావిపూడి వెంకటాద్రి
15. కులనిర్మూలన – డా॥ అంబేడ్కర్
16. పూర్వగాథాలహరి – వేమూరి శ్రీనివాసరావు.
17. చార్వాకుడు – బి. రామకృష్ణ.
18. హేతువాద నాస్తికోద్యమం – సి. వి.
రంగనాయకమ్మకు సమాధానం
19. కౌటిల్యుని అర్థశాస్త్ర
పూర్వాపరాలు – సి. వి.
20. అస్పృశ్యులెవరు? – డా॥ అంబేడ్కర్
21. వర్ణవ్యవస్థ – సి. వి.
22. ప్రబోధ చంద్రోదయం
(నాటకం) – ఘంట సింగయ, నంది మల్లయ
23. మనుస్మృతి –
24. భాగవతం (ఒకటి, రెండు భాగాలు)

25. సారమతి నన్నయ — ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి
26. కవిరాజు — క్రొత్త సత్యనారాయణ
27. జాబాలి — నార్ల వెంకటేశ్వరరావు.
28. వేమన - పాశ్చాత్యులు — తెలుగుసేత
మరుపూరి కోదండరామిరెడ్డి
29. వేమన పద్యరత్నాకరము —
30. వేమన్న వేదం — ఆరుద్ర
31. వేమన చరిత్ర — బండారు తమ్మయ్య
32. సూతపురాణం — కవిరాజు
33. భగవద్గీత — కవిరాజు
34. శాస్త్రం - పురాణం — రావిపూడి
35. పరాశరస్మృతి
36. వాజపేయం ( అముద్రితగ్రంథం )
37. కులవ్యవస్థ — తుమ్మల
38. కవిరాజు దర్శనం
39. దేవీభాగవతం
40. వాల్మీకి రామాయణం
41. Verses of Vemana — C. P. Brown
42. శంబుకవధ — కవిరాజు
43. ఖూనీ — కవిరాజు
44. దేవాలయాలమీద బూతు
బొమ్మలు — తాపీ ధర్మారావు
45. వేమన వాదం — గోపి
46. పెండ్లిమంత్రాల బండారం — వెనిగళ్ళ సుబ్బారావు
47. ఋగ్వేద విజ్ఞానము — శ్రీ గంగారము నరసింహదీక్షితులు
శ్రీ గంగారము హనుమచ్ఛర్మ

ఇంకా పురాణాలు, స్మృతులు, ఉపనిషత్తులు.

# విశ్లేషణ

సంజీవదేవ్.

ఆనాడు నరులంతా వానరులట; ఈనాడు నరులు నరులే వానరులు వానరులే. నాడు వానరులేకాని నరులు లేరని; నేడు నరులూ వున్నారు, వానరులూ వున్నారు. నేడున్న వానరులలో నరత్వం లేకపోవచ్చుకాని నరులలోమాత్రం వానరత్వం లేకుండాపోలేదు. తోక లేకపోవటం మాత్రమే నరత్వానికి లక్షణంకాదు, తోకలేని కోతులుకూడ వున్నాయి.

ప్లీస్టసీన్ మహాయుగపు అంత్యభాగంలో, అంటే ఒక లక్షసంవత్సరాలనాడు నేటి ఆధునిక మానవుడుగా రూపొందేడు మానవుడు. అంటే ఆధునిక మానవుని వయస్సు లక్షసంవత్సరాలని, అప్పటినుండి మానవవికాసం అనేక కాలాల్లో అనేక రీతుల్లో, నీతుల్లో రూపం పొందుతూ రూపాంతరం చెందుతూ ప్రాచీన శిలాయుగం, నవ్యశిలాయుగం, తామ్రయుగం, కాంశ్యయుగం, లోహయుగం మొదలైన వాటిని దాటి నేడు పరమాణుయుగంలో ప్రవేశించింది.

ప్రపంచంలోని ప్రతిదేశంలో జాతులు, మతాలు వున్నాయి కాని కులాలు అనబడేవిలేవు. అన్ని దేశాలలో వృత్తులనుబట్టి, ఆర్థికతారతమ్యాలనుబట్టి వర్గాలున్నాయి కాని కులాలులేవు. కులాలకంటే అవన్నీ కొంత విశాలమైనవి కావడంతో వాటివల్ల కొంత తక్కువ ప్రమాదంవున్నది సమాజానికి; కులాల విషయం ఇందుకు భిన్నం. జాతులకంటే, మతాలకంటే, వర్గాలకంటే కులంఅనేది ఎక్కువ సంకుచితమైంది కావటంతో వాటన్నిటికంటే ఇది మానవజాతికి ఎక్కువ ప్రమాదకరం.

కులం అనేది ప్రపంచంలో ఒక్క హిందూమతంలో మాత్రమే వున్నట్లు తెలుస్తున్నది. ప్రపంచంలోకల్లా ఒక్క హిందూవేదాంతంలోనే చీమమొదలు బ్రహ్మవరకు దైవత్వమే అన్నారు. ఇంత మహాసమత మరేఇతర దర్శన శాస్త్రాల్లోను గోచరించదు. అటువంటి సమానతను సంకల్పించిన హిందూమతంలోనే నీచమైన కులభేదాలు ఆచరించబడుతూ కొన్నికులాలలోని మానవులనుకూడ అంట రానివారుగా ఏర్పరచారు. హిందూమతంలోని ఆలోచనలో అంతమహాత్వం, ఆచరణలో ఇంతనీచత్వం! విచిత్రం!!

కులవివక్షేపం మానవునకు ఒక గొప్ప గొడ్డలిపెట్టు. మానవుని వైయ్యక్తిక ప్రతిభ ప్రతికూలంగా నశిస్తుంది. ప్రతిభనుబట్టికాక కులాన్నిబట్టి మనిషికి గొప్పదనం అంటగట్టటం జరుగుతుంది. ఒక వ్యక్తిలో ఎంత మౌలిక ప్రతిభవున్నా, ఆవ్యక్తి క్రిందికులానికి చెందినవాడైతే వానికి సరైన విలువ నివ్వకపోవటం, వాని ప్రతిభను గుర్తింపటంలో విముఖత చూపటం మొదలైన అవాంఛనీయాలు జరుగుతుంటాయి. అందువల్ల మానవీయ మూల్యాలు మూల్యాన్ని పోగొట్టుకుంటాయి.

శ్రీ పద్మారావు రచించిన "కులంపునాదులు" గవేషణతో నిండిన రచన. ఈరచయిత ఇదివరలో కవిగా పరిచితుడు. సాహితీ రంగంలో "జనగీతం" అనే కవితా రచనను ప్రచురించి పేరుతెచ్చుకొన్నారు. ఇపుడు ఈయన ఈ "కులంపునాదులు" ద్వారా ఒకపదునైన విద్వాంసుడుగా. గవేషణకర్తగా. చారిత్రక అన్వేషిగా ప్రత్యక్షమైనారు. ఈరచనలో ఆయన చేసినశ్రమ, సక్రమసమీక్ష, తీసుకున్న వాస్తవిక నిర్ణయాలు మొదలయినవి ప్రశంసనీయాలు.

చరిత్రలమీద ఆధారపడి సత్యాన్వేషణ చేయటంలోకూడ క్రమేణ కొన్ని చిక్కులేర్పడుతున్నాయి. చరిత్రాంశాలకుకూడ నిలకడ వుండటల్లేదు. ఒకనాడు చారిత్రకసత్యం అనుకొన్నది మరోనాటికి మారిపోతున్నది. ఒకప్పుడు సింధులోయకు చెందిన సభ్యతా సంస్కృతులు ఆర్యులవికావనీ, అవి అనార్యులవి అనీ నిర్ధారించారు. హరప్పా, మొహంజదారోల సింధుసభ్యతా సంస్కృతులు అనార్య నిర్మితాలని ఎన్నో నిదర్శనాలు చూపేరు. ప్రసిద్ధ ప్రాచ్య పాశ్చాత్య పురావస్తు శాస్త్రజ్ఞులు, కాని నేడు కొందరునిపుణులు దాన్నిమార్చి నిర్ణయాలు చేశారు. ఇటువంటి వారిలో ప్రముఖులు డాక్టర్ యస్. ఆర్. రావు. ఈయన విశిష్టత ఏమంటే. ఇంతవరకూ సక్రమంగా, సమగ్రంగా, చదవబడని సింధులోయ లిపిని చదివి దాన్ని విశదీకరించ కలగటం, ఎన్నోవేల ఈలిపి ఫలకాల్ని ఆయన సంవత్సరాల పర్యంతం అధ్యయనం చేయటంద్వారా తేలిన సత్యాలేమంటే సింధులోయ సభ్యతా సంస్కృతులు అనార్యులవికావు, ఆర్యులవేఅని. ఈ నూతన ఆవిష్కారణలను కొందరు శాస్త్రజ్ఞులు ఆమోదించారు, మరికొందరు వ్యతిరేకించారు.

ఈ విధంగా ప్రాచీన సత్యాలను తేల్చటానికి చరిత్రమీద ఆధారపడటంకూడ అనుమానాస్పదమైంది. ప్రస్తుతపు గ్రంథకర్త కులాల-పునాదులను కనుగొనటానికి వేదాలు, పురాణాలు మొదలైన వాటిమీద చాలావరకు ఆధారపడుతూ వచ్చారు. వేదాలు, శ్రుతులు, స్మృతులు, ఇతిహాసాలు ఏవీ ఈగ్రంథకర్త దృష్టినుండి జారి

పోలేదు. తెలుగు అనువాదాలమీద మాత్రమే ఆధారపడక శ్రీ పద్మారావు మౌలిక సంస్కృత రచనలనుండే తమకు కావలసిన సామగ్రిని సేకరించి తమరచనలో ఉదాహరణ లిచ్చారు.

ఈ గ్రంథకర్తచేసిన మరోగొప్ప పనేమంటే, ఈ గ్రంధాన్ని వేమనకు అంకితం చేశారు. కులతత్వాలను గురించి వేమన తనజీవితంలో ఎంతగానో వ్యతిరేకించాడు, దాన్నిగురించి ఎన్నోకవితలు రచించాడు. అటువంటి మహామనీషి అయిన వేమనకు ఈ "కులం-పునాదులు" ను అంకితం చేయబూనటం ఎంతో సముచితంగా వున్నది. తెలుగులో వేమన, కన్నడంలో సర్వజ్ఞ, హిందీలో కబీర్, పంజాబీలో నానక్, బెంగాలీలో చండీదాస్ మొదలైనవారు కులతత్వానికి వ్యతిరేకంగా తమతమ కవితలద్వారా శంఖాలను పూరించి సామాజిక శ్రేయాన్ని సృష్టించారు. శ్రీ పద్మారావులాంటి సంస్కార రచయితలుకూడ తమ సాహితీ శిల్పంద్వారా సమాజంనుంచి ఈ కులతత్వ పిశాచాన్ని పారదోలటానికి సన్నద్ధులు కావటం ప్రమోదదాయకం. సాహితీ రచనలద్వారా పాఠకులకు రసానుభూతికి తోడు సామాజిక హితాన్నికూడ అందించటం మానవతా సాహిత్యపు లక్షణం, లక్ష్యంకూడ. ఈ గ్రంథకర్త ఇటువంటి గ్రంథరచనలద్వారా చేస్తున్న సాహితీసేవ అదే.

తమ ఉపోద్ఘాతంలో ఆర్యానార్యులను గురించీ, ఆదిమవాసులను గురించీ గ్రంథకర్త వివరంగా చర్చించారు. ఆర్యులకంటే అనేక విషయాలలో అనార్యులు గొప్పవారని తెల్పటం జరిగింది. దాదాపు అరవై సంవత్సరాలనాడు భారతీయ పురాతత్వశాఖ సింధులోయ సభ్యతను మొహంజదారో హరప్పాప్రాంతాల త్రవ్వకాలలో కనుగొన్నది. అప్పటినుంచి ఆ సభ్యత ఆర్యులదికాదు, అనార్యులదిఅని ఎంచబడుతూ వచ్చింది. అనార్యులంటే ద్రావిడులు మాత్రమేకాదు, ఆర్యులుకాని ఇతరజాతుల వారందరూ అనార్యులే. ద్రావిడులందరూ అనార్యులేకాని అనార్యులందరూ ద్రావిడులుకారు. అయితే, అనార్య జాతులలో ద్రావిడులు ప్రధానులు.

ఆర్యులు భారతదేశంలో ప్రవేశించేనాటికే, అంటే దాదాపు క్రీ.పూ॥ రెండు వేల సంవత్సరాలనాటికే భారతదేశంలో అనార్య సభ్యత పూర్ణంగా వికసించి వున్నదనీ, గొప్పగొప్ప నగరాలు, సుందరమైన వాస్తునిర్మాణాలు, లలితమైన శిల్పసృష్టి, చిత్రరచన, ఎక్కి-తిరగటానికి రథాలు మొదలయిన వాటన్నిటినీ అనార్యులు కౌశలంతో నిర్మించుకొని వున్నారనీ, భారతదేశంలో ప్రవేశించిన

ఆర్యులకు ఇటువంటి కళలతో పరిచయంలేదనీ, ఆర్యులు ఆలోచనా నిపుణులనీ, దార్శనిక చింతన వారి ప్రధానలక్షణమని, జీవితంఅంటే ఏమిటి, మృత్యువు అంటే ఏమిటి అనేసూక్ష్మవిషయాలలో వారునిపుణులనీ ఎంచబడుతూ వచ్చింది. కాని ఇటీవల డాక్టర్ యస్. ఆర్. రావు విశదీకరించి సింధులోయ లిపినిబట్టి అదంతా కూడ ఆర్యసభ్యతయేకాని అనార్యంకాదని ఒకనూతన సిద్ధాంతం వెలుగులోనికి వచ్చింది,

ఈ అనార్యజాతులలోని ఆదిమవాసులు, వారికులాలను గురించి ఈ గ్రంథ కర్త కొంతవివరించారు. ఆదిమవాసులలోకూడ కులాలుండటం విశేషం. ఎరుకల యానాది, కోయ, సవర, చెంచు మొదలయిన ఇంకెన్నో కులాలు ఆదిమవాసులకు చెందినట్టివి. వీటన్నిటిని గురించికూడ ఈ గ్రంథంలో వివరణ వున్నది.

క్రీ.పూ॥ ఒకవేయి సంవత్సరాలనుంచి భారతదేశంలో వర్ణవ్యవస్థవుండినట్లు ఈ గ్రంథకర్త సోదాహరణంగా వివరించారు. కులానికి వర్ణంఅనేపేరుకూడ వుండటాన్ని విశదపరచబడింది ఇందులో కులాలను ఏర్పరచబడటంలో మనుషుల రంగు లేక వర్ణాన్ని అనుసరించికూడ నిర్ణయంజరిగింది. బ్రాహ్మణులది కపిలవర్ణం అనీ, క్షత్రియులది తెలుపుఅనీ, శూద్రులది నలుపుఅనీ, కనుక ఆయావర్ణాలకు ఆయాకులాలు చెందివున్నాయని, అందుకే కులాన్ని వర్ణంఅనికూడ అన్నారు. ఈ వివరాలన్ని ఈ గ్రంథంలో విశదంగా చెప్పబడినాయి. ఒకవైపున కులంపునాదులు గట్టిపడుతుంటే మరోవైపున కులవ్యతిరేక ఉద్యమాలు తలలెత్తుతూ వాటిని భగ్న పరచేయత్నాలు చేస్తూనేవున్నాయి పూర్వంనుండి.

ఈ వర్ణవ్యతిరేకోద్యమాలలో ప్రధానమైంది లోకాయతవాదం. ఇది బౌద్ధానికంటే ప్రాచీనమైంది. ఇది నిరీశ్వరవాదంతో కూడిన భౌతికవాదం. “లోకేషుఆయతః లోకాయతః” అన్నారు. అంటేలోకానికి, ఇహలోకానికి ప్రాధాన్యం ఇచ్చినవాదం లోకాయతం. ఇది అనాత్మవాదం. శరీరంలో ఆత్మఅనే అస్తిత్వం వున్నదని వీరు అంగీకరించరు. ఇంద్రియగ్రాహ్య జగత్తుమాత్రమే సత్యం. అతీం ద్రియగ్రాహ్యం అనేది మిథ్యఅని లోకాయతుల సిద్ధాంతం. వర్ణరహిత మానవ సమాజస్థాపన వీరిలక్ష్యం.

ఈ గ్రంథంలో లోకాయతశాస్త్ర గ్రంథాల్లోనుండి చాలామౌలిక శ్లోకాలు ఎత్తిచూపబడినాయి వర్ణవ్యతిరేకతను గురించినవి. ఈ విధమైన గవేషణలో

ఈ గ్రంథకర్త చాల శ్రమపడినట్లు కనిపిస్తుంది. ఎన్నో మతాలకు సంబంధించిన, దర్శనాలకు సంబంధించిన, చరిత్రకు సంబంధించిన, అనేక గ్రంథాలను పరిశీలన జరపవలసి వుండివున్నది ఈ గ్రంథరచనకు. ఇది కేవలం శ్రీ పద్మారావు స్వీయఆలోచనలూ విశ్వాసాలూ, అభిమానాలూ మొదలయినవాటికి సంబంధించిన ఊహాగానంకాదు; నిదర్శనాలతో నిండిన, మౌలిక సిద్ధాంతాలతోకూడిన పరిశోధనా ఫలితమైన వాస్తవాలగ్రంథం ఇది.

లోకాయతం తరువాత వర్ణవ్యవస్థను ఎదుర్కొనటంలో పరోక్షంగా పని చేసింది జైనమతం. జైనాన్ని మతవిప్లవంఅనీ, బౌద్ధాన్ని సామాజిక విప్లవంఅనీ పేర్కొన్నారు శ్రీ పద్మారావు. మతవిప్లవాన్ని కలిగిస్తూనే. దానిద్వారా కులాలను కూడ వ్యతిరేకించింది జైనం, అంతర్వాహినిరూపంలో.

బౌద్ధాన్ని మతం అనేకంటే ఒక నవ్యమానవతా సమాజవ్యవస్థ అనటం ఎక్కువ సమంజసంగా వుంటుంది. అదొక జీవనవిధానం, ఒక బతుకుబాట. వర్ణ రహిత, వర్గరహిత జీవుల సౌభ్రాతృత్వం దానిధ్యేయం, కరుణామయ సమత దాని లక్ష్యం. ఇటువంటి ఉన్నత భావప్రేరితమైన బౌద్ధం కులాల తారతమ్యాన్ని ఏవిధంగా ఆమోదించగలదు. వీటన్నిటినీ ప్రతిఘటించటమే దానినైజం, మాన వతకు మారణహోమాన్ని అందించే కులతత్వాన్ని రూపుమాపేకంటే మించిన సామాజిక విప్లవం మరేముంటుందికనుక? నిస్స్వార్థ కారుణ్యమే నిర్వాణం!

వీటన్నిటినీ చర్చించినతరువాత గ్రంథకర్త మౌర్యుల విషయాన్ని ప్రస్తా విస్తారు. మౌర్యులకాలంలో కులాలు బాగావ్యాప్తిచెంది వున్నాయి. భారతదేశ చరిత్రలో మౌర్యయుగం ఒకప్రత్యేకతను కలిగివున్నది. ప్రత్యేకించి చంద్రగుప్త మౌర్యుని కాలంలో, చాణక్యునివంటి మేధావి అప్పటికి మహాగ్రంథమైన అర్థ శాస్త్రాన్ని రచించటం, గ్రీకులలాంటి విదేశీ మహామహులతో సాన్నిహిత్యాన్ని మాత్రమేకాక బాంధవ్యాన్నికూడ కలిగివుండటం సాంస్కృతికంగా ఉన్నతస్థాయిని కలిగి ఉండటం మొదలయినవి చెప్పుకోతగ్గ విషయాలు అయినప్పటికీ ఈ కాలంలో కూడ వర్ణవ్యవస్థ చాలా పాతుకుపోయి వున్నది.

కౌటిల్యుని (చాణక్యుని) అర్థశాస్త్రం, మనుస్మృతి, పురాణాలు మొదలైన ప్రాచీన గ్రంథాల్లోని వర్ణవ్యవస్థా వివరాలను గురించికూడ ఈ గ్రంథంలో సోదా హరణంగా వివరించబడింది. అయితే, ఆనాడు వర్ణవ్యవస్థవున్నాకూడ ఈనాటికంటే

స్వేచ్ఛగా అంతర్వర్ణ వివాహాలు వుంటుండేవి. నేడు అంతర్వర్ణవివాహం చేసుకోటంఅంటే అదేదో గొప్ప సంఘసంస్కారంగా ఎంచబడుతున్నది. కాని ఆనాడు అదొక సామాన్య విషయంగానే వుండేది.

కులంపై దండెత్తిన తెలుగుకవులైన వేమన, త్రిపురనేని, జాషువా, వీరిని గురించికూడ ఇందులో తగినంతగా వివరణ యీయబడింది. తెలుగుదేశంలో ఈ ముగ్గురు మహనీయులుకూడ మూడుకులాలకు చెందినవారు. అయినా, వీరుముగ్గురూ కులం అనేమాయను దాటిన మహామనీషులు. కులతత్వంపై యుద్ధంచేసిన యోద్ధలు. ముగ్గురుకూడ తిరుగుబాటుకవులు. తమకలాలను కత్తులవలె ఉపయోగించిన ధీరులు. వీరు తమ రచనల్లోనేకాక వాస్తవ జీవితంలోకూడ వర్ణవ్యవస్థకు వ్యతిరేకంగా జీవించిన ఆదర్శజీవులు. అందువల్ల వీరిని గురించి ఈ గ్రంథంలో తగినంతగా పేర్కొనని పక్షంలో ఈగ్రంథం అసమగ్రంగా వుండిపోయే ప్రమాదాన్ని కలిగి వుండేది,

మన దేశంలో కొందరు కేవలం సంఘసంస్కర్తలేకాని రచయితలుకారు; మరికొందరుకేవలం రచయితలేకాని సంఘసంస్కర్తలుకారు. కొద్దిమందివున్నారు సంఘసంస్కర్తలూ రచయితలూ అయినవారు పైముగ్గురూ అటువంటివారే. మాటకంటేచేతకు బలంఎక్కువ అంటారు. కాని చాలావిధాలైన చేతలకు ప్రేరణనిచ్చేవి మాటలే అనేసత్యం అసత్యంకాదని చరిత్ర తెలుపుతుంది.

నిజానికి శ్రీ పద్మారావుకూడ రచయితా సంఘసంస్కర్తకూడ, ఆయన మాటలు చేతలకు ప్రేరణకలిగిస్తే ఆయన చేతలు మాటలకు బలాన్ని కలిగిస్తాయి. కవిగావుండికూడ ఆయన ఆకాశంలో విహరించక ఈ భూమిమీదనే నడిచారు. ఇప్పుడు సమీక్షాత్మక రచయితగా ఈ "కులం పునాదులు" అనేగ్రంథంలో వాస్తవాలకు దూరంకాకుండా, కల్పనకు దూరమై, సజీవసత్యాలకు అక్షరరూపాన్ని ప్రదర్శించటంలో తమదక్షతను దర్శింపజేశారు.

రచనలు ప్రధానంగా మూడువిధాలైనవి. కేవలసృజనాత్మకం, కేవల సమీక్షాత్మకం, ఉభయాత్మకం. స్థూలఉపయోగానికంటే రసానుభూతికే ప్రాధాన్యంఇచ్చి రచించే పద్యాలూ గద్యాలూకూడ కేవలసృజనాత్మక సాహిత్యం క్రిందకు వస్తాయి; రసప్రదర్శనకుకాక ఒకవిషయాన్ని విశదంగా, పరిశీలనాత్మకంగా వివరించేరచనలు సమీక్షాత్మకాలవుతాయి. ఇక అటుపరిశీలననూ ఇటురసానుభూతినీ రంగరించి రచించే రచనలు ఉభయాత్మకాలవుతాయి. రచనలోని వస్తువు పరిశీలనాత్మకమైనా,

రచనాశైలి సృజనాత్మకంగావుండే రచనలుంటాయి. వీటినే ఉభయాత్మకంఅనవచ్చు. అయితే, ఈ శైలిలో రచించబడే పరిశీలనా గ్రంథాల్లో చారిత్రక గ్రంథాల్లో అలంకారిక శైలిచాటున వాస్తవాలు మరుగుపడే అవకాశంవుంటుంది. అందుకే ఈ గ్రంథంలో ఈ మూడవ పద్ధతికాక రెండవ పద్ధతి అవలంబించబడింది.

మనం నివసిస్తున్నాం నేడు పరమాణుయుగంలో, అంతరిక్షయానకాలంలో, చంద్రునిపై కాలుమోపిన విజయోత్సాహంలో; ఇన్ని నెరవేరుస్తున్నాకూడ కుల శృంఖలాలనుండి విముక్తిని నెరవేర్చలేక పోతున్నాం. వైజ్ఞానికంగా ఇంతఉన్నతి గడించిన ఆధునిక జగత్తులో నివసిస్తూ ఇంతవరకూ కులతత్వంనుండి బయటపడ లేకపోతున్నాం అంటే మనం సజీవులమో నిర్జీవులమో బోధపడటంలేదు.

విచిత్రంఏమంటే, ఇదివరలోకంటే ఇప్పుడు కులాల పట్టుదలలు మితిమీరి నాయి. ఇదివరలో మనుషులకు తమతమ కులాలమీద నమ్మకాలుండేయి, అభిమా నాలుండేయి. అయినా, అప్పుడు ఇప్పుడున్నంత కులాల పట్టుదలలుండేయికావు. నేడు ప్రజలకు తమతమ కులాలమీద వెనకటి నమ్మకాలూలేవు, అభిమానాలూలేవు; అయినా, కులాలపట్టుదలలు ఎక్కువయినాయి. ఇందుకు ప్రధానకారణం, రాజకీ యాలకూ, ఇంకా ఇతర వ్యావహారిక విషయాలకూ కులాన్ని ఒకఉపకరణంగా వాడుకుంటున్నారు.

దేశంలో ఎన్నోఅసంఖ్యాక కులాలు. అవిచాలవన్నట్లు వాటిలో తిరిగిఎన్నో ఉపకులాలు! ఒకప్పుడు కొన్నికులాలు మాత్రమే వుండేవి. కాని క్రమేణవాటిలో నుంచి ఉపకులాలు, ఆ ఉపకులాలనుండి మళ్ళీఉప ఉపకులాలు ఉద్భవిస్తూ రావ టంతో కులాలసంఖ్య అపారంగా పెరిగిపోయింది. తెలుగుదేశంలో కొన్నికులాలు మతంపేరుతోకూడ వున్నాయి. వైష్ణవమతాన్ని అవలంబించినవారు చాలాకులాల్లో వున్నారు. వారిమతం మాత్రమే వైష్ణవంకాని వారికులం వైష్ణవంకాదు. అవిధంగా కాక కొందరు వైష్ణవ మతస్థుల కులంకూడ 'వైష్ణవులు' అనేపేర పిలవబడుతూ వుంది. అదేవిధంగా వీరశైవులుకూడ. జంగాలు అనువారిని వీరశైవులనికూడ అంటారు. బసవేశ్వరునిద్వారా కర్ణాటకలో ప్రవేశపెట్టబడిన వీరశైవమతంలో నిజానికి కులంవివక్షతలేదు. కాని తెలుగుదేశంలో ఆ వీరశైవులు ఒకమతస్థులుగా మాత్రమేకాక ఒకకులంగాకూడ వాడుకలోవున్నారు.

చదువుకున్నవాళ్ళలో చదువుకోని వాళ్ళలోకూడ కులపిశాచం తాండవిస్తుం టుంది. ప్రయాణాల్లో ఒకకొత్తవ్యక్తి పరిచయంకాగానే ఆయన ఏవూరివాడైనదీ తెలుసుకొన్న తరువాత ఆయన ఏకులానికి చెందుతాడో తెలుసుకోవాలని పిచ్చి

కుతూహలం. కొందరు ఆకుతూహలాన్ని నిలుపుకోలేక సూటిగా అడిగేస్తారు. 'మీరెవరండీ' అని, ఇంకొందరు ఆవిషయాన్ని ప్రత్యక్షంగా అడగలేక కొన్ని పరోక్షమార్గాలను అవలంబిస్తారు. వీరుకులాన్ని అడగకుండా ఇంటిపేరును అడుగుతారు. ఇంటిపేరునుబట్టి కులం తెల్సుకోవచ్చని, మరికొందరు ఇంతకంటేకూడ ఇంకా ఎక్కువ పరోక్షమార్గం అవలంబిస్తారు. వీరు ఆవ్యక్తి ఇంటిపేరునుకూడ అడగక రెండుమూడు కులాల ఇంటిపేర్లనుచెప్పి - ఆయింటిపేర్లలోని వారెవరైనా మీకు బంధువులా అనిఅడుగుతారు, ఆఇంటిపేర్లలోని వారెవరైనా తమకు బంధువని ఆవ్యక్తి జవాబిస్తే అప్పుడు తేలిపోతుంది ఆవ్యక్తి ఏకులానికి చెందినవాడయిందీ కులంగురించి ఎందుకో ఇంతజిల ? మనదేశంలో కులాలపేరిట వెలసిన సంఘాలకు సభలకూకూడ కొదువలేదు.

ఈ విధంగా కులంఅనేది హైందవుల జీవితాల్లో జీర్ణించుకుపోయింది. మరో విచిత్రం ఏమంటే మతంమారినా కులంమారటంలేదు. మన ప్రాంతంలో కొన్ని కులాలవారు క్రైస్తవమతంలోకి మతాంతరం చెందినవారున్నారు. వారిమతం మారిందికాని వారికులంమారలేదు. వారునూతనంగా క్రైస్తవులుగా జీవిస్తున్నాకూడ వారిబాంధవ్యాలూ, వైవాహిక సంబంధాలు అన్నీకూడ వారిస్వీయకులం వారితో మాత్రమేజరుగుతాయి. మతాన్నిదాటినా కులాన్ని దాటజాలక పోతున్నారు.

ఇంతహానికరమైన కులం అనేవిషయాన్ని తీసుకొని దాని పునాదులవరకు చొచ్చుకొనిపోయి దానిపుట్టుపూర్వోత్తరాలను గురించీ, దాని స్వభావ స్వరూపాలను గురించీ గవేషించి ఈ "కులంపునాదులు" రచించి శ్రీ పద్మారావు సామాజిక సాహిత్యోద్యానంలో ఒక సురభిల పుష్పాన్ని పూయించారు. ఈ పుష్పపు సురభి పాఠకులకు ఆనందాన్నివ్వటం మాత్రమేకాక ఆలోచననుకూడ ఇస్తుంది; అంతేకాక ఎంతో శ్రేయాన్నికూడ ప్రసాదిస్తుంది,

మనిషికీ మనిషికీ మధ్యవున్న కులం అనే అమానుష్యాన్ని అధిగమించి, విస్తృత మానవతా దృక్పథాన్ని అవలంబించి, మనిషిఅంటే కులంలేని ప్రాణిగా నమ్ముతూ, సర్వమానవ సౌభ్రాతృత్వపు వెలుగును అందుకోటంలో ఇటువంటి గ్రంథాలు చేయూత నివ్వటంలో వెనకాడవు.

అప్పుడు రచనద్వారా రచయితకు, రచయితద్వారా రచనకు వెన్నెల లభిస్తుంది- తెల్లని వెన్నెల, చల్లని వెన్నెల! ఆ వెన్నెలకిరణాలు ప్రకాశిస్తాయి మానవ సమాజపు మట్టిమీద !!!

సామాజిక విప్లవ కవి
కులాల పునాదుల్ని కదలించిన
ప్రజాకవి
వేమనకు —

— అంకితం —

# సామాజిక విప్లవ కవి

ధర్మ మర్మము లెఱింగిన తాత్వికుండు
మర్మ ధర్మము లెఱింగించు మాన్యగురుండు
జాతికి న్నీతి గఱపు నిష్ఠాపరుండు
వేమన వచించినది సత్యవేదమన్న!

జనములో జంతు తత్త్వమ్ము పెనుచునట్టి
మనువు ధర్మమ్ము భరతోర్వి మసలు నాఁడు
బోధియై వేదవేదియై బుద్ధి గఱపు
వేమన వచించినది సత్యవేదమన్న!

సత్యతత్త్వ పథమ్మును సామ్యవాద
సామనస్యము ననుభవసార గరిమఁ
బలుకు పలుకునఁ జిప్పిల్లి తెలుఁగు లలిత
వేమన వచించినది సత్యవేదమన్న!

మీఁగడల ముద్దకంటెను మెత్తఁదనము
కఱకు టమ్మును మించిన చుఱుకుఁదనము
పద పదమ్మున నింపిన భావుకుండు
వేమన వచించినది సత్యవేదమన్న!

లోకవృత్తమ్ము నారయలేక కవులు
కొంప్యంబారిన భావాలు కూయునాఁడు
సంస్కరణ దీప్తి కవితలో సందడింప
వేమన వచించినది సత్య వేదమన్న!

బూటకపు మాటలను గవుల్ ప్రోగుచేసి
శ్లేషయమకాల గారడీ సేయు నాఁడు
తెలుఁగు వెలుఁగులతో నెల్ల దెసలునింప
వేమన వచించినది సత్య వేదమన్న!

ప్రజలు గొంతెత్తి నిత్యమ్ముఁ బాడుచుండు
సారమింకని భావాలు చాటి చాటి
చెరగి పోవని చరితలోఁ జేరునట్లు
వేమన వచించినది సత్య వేదమన్న!

జీవజలములు పొంగించు భావములను
చేవ చెన్నులు వెలిగించు జీవములను
జిత్తములు పొంగు నీతులఁ జేర్చికూర్చి
వేమన వచించినది సత్య వేదమన్న!

తెలుఁగు పలుకుల చిన్నారి కులుకునడలఁ
బసిడి గగ్గెర రవళింపఁబడ పదాన
ఆట వెలఁదులు నర్తింప నమరకవిత
వేమన వచించినది సత్య వేదమన్న!

వెఱ్ఱి వేదాంత చర్చల విసిగియుండ
హేతువాదము జాతికి హితవుఁ జేసె
ప్రజలఁ బ్రశ్నింప నేర్పిన పరమ గురుఁడు
వేమన వచించినది సత్యవేదమన్న!

ఉక్తి విశ్వజనీనమై సూక్తికాఁగ
సార్వకాలిక సత్యమ్ము చాటిచెప్పి
స్వేచ్ఛ బీజాలు జాతిలోఁ జిమ్మినట్టి
వేమన వచించినది సత్యవేదమన్న!

ప్రజల నాల్కల నర్తించు పదములేరి
దేశినుడి నానుడులఁ సొంపు దెసలనిండ
నిక్కమగు తెల్గుకవిత రాణించు కరణి
వేమన వచించినది సత్యవేదమన్న!

దార్శనిక వాఙ్మయమ్ము విమర్శచేసి
జానుఁదెనుఁగునఁ జాటిన జాతి సుకవి
సంఘరుగ్మతఁ బాపెడి సద్గురుండు
వేమన వచించినది సత్యవేదమన్న!

జుంటి తేనియ సోనలు జుబ్బుకొనఁగ
భావి వేదమ్ము వినిపించె భారతమున
జీవ నినదమ్ము హృదయాలఁ జిపురులెత్త
వేమన వచించినది సత్య వేదమన్న!

మతము మత్తునఁ జిత్తైన మానవుండు
భావ దాస్యాన మతిలేని పశువు కాఁగ
కైత నొక వాడిగల ములుగఱ్ఱఁ జేసి
వేమన వచించినది సత్య వేదమన్న!

సన్నజాలుగాఁ గాఱిన జాను తెనుఁగు
పల్లె ప్రజలను తనిపెను పలుకు బడుల
ఊసు బాసల కూపిరి వోసినట్టి
వేమన వచించినది సత్య వేదమన్న!

కర్మకాండల ఆగబోగాల డులుపు
జన్మములలోని లోగుట్టుఁ జాటిచెప్పు
పుష్టిగల సూక్తి చయము సంసృష్టి చేయు
వేమన వచించినది సత్య వేదమన్న!

రాజుగారి ఉంపుడుగత్తె రంకు కథలు
కాసు కాసించి కవులెల్లఁ గవితలల్ల
కామినీ కాంచనమ్ములు కాల రాసి
వేమన వచించినది సత్య వేదమన్న!

శబ్దశాసను మించిన సరళ ధార
తిక్కయజ్వకు దీటైన తెలుఁగుదనము
దివ్యసందేశములు గాఁగ దీర్చిదిద్దు
వేమన వచించినది సత్య వేదమన్న!

నిక్కమైన ప్రజాకవి యొక్కడతని
కవుల వరుసలోఁ జేర్చెడు కందుకూరి
సత్యవాక్యంబు దాగునే చరితయందు
వేమన వచించినది సత్య వేదమన్న!

# కులం - పునాదులు

## ఉపోద్ఘాతం

ఈ దేశంలో కులం జాతీయ జీవనంలో అంతర్భాగంగా కలిసి పోయింది, మానసిక దుర్మతగా మిగిలిపోయింది. కులం ముద్రలేని మనిషి భారత దేశంలో లేడని చెప్పవచ్చు. కులాలన్నీ ప్రత్యేక జీవిత విధానాన్ని ఏర్పరచుకున్నాయి. ఈ వైవిధ్యం జాతీయతా దృక్పథాన్నుంచి కుల పరిధి లోనికి భారతీయులను ఈడ్చుకొచ్చింది. అందు వల్లనే అభ్యుదయ విప్లవోద్యమాలు కూడ ఈ కులం రంగు నుంచి బయటపడలేక పోతున్నాయి. దీన్నిబట్టి ఈ దేశంలోని సామాజిక వ్యవస్థ కులం పునాదుల మీద నిలబడి వుందని తెలుస్తుంది. ముఖ్యంగా గ్రామాల్లో పాతుకున్న ఈ ఉక్కు పునాదుల్ని ఏ ఉద్యమాలూ కద లించలేక పోతున్నాయి. దీన్ని గమనించే డా॥ అంబేడ్కర్ "మీ సమాజాన్ని మీరు మార్చుకోకపోతే ఏవిధమైన అభ్యుదయాన్ని సాధించలేరు. కులం పునాదులమీద మీరు దేనినీ నిర్మించలేరు. ఒక జాతిని నిర్మించలేరు. ఒక నీతిని నిర్మించలేరు"[1] అని అన్నారు.

---

1. కుల నిర్మూలన.

భారతీయ జీవన వ్యవస్థను కులవ్యవస్థగా మార్చిన హిందూ సంస్కృతి—ఆ హిందూ సంస్కృతిని పెంచి పోషించిన హిందూ మత వ్యవస్థకు ఈనాడు మిగిలిన సంపద కుల ప్రాధాన్యమే.

ఈ కులాన్ని పోషించడానికే హిందూమతం తన శక్తిని రంగరించి పోసింది. తన యుక్తిని ప్రదర్శించింది. హిందూ ధర్మాన్ని ప్రబోధించే గ్రంథాలన్నీ దాదాపు కుల ధర్మాన్నే ఎక్కువగా బోధించాయి. "చివరకు జ్యోతిషము, వాస్తుపురాణ జాతులను, వర్ణాలను ఆరాధించినవే. అందువల్ల ఆ గ్రంథాలు గ్రహాదులనూ గృహాదులనూ వర్ణవిభాగం చేసినవే".² చివరకు ఛందస్సులోని వర్ణాలకు, అక్షరాలకు కూడ ఈగతి పట్టింది. హిందూ ధర్మాల్ని ప్రచారం చేయడానికొచ్చిన పురాణాలు, ప్రతి కథలో కుల సంస్కృతిని జాతికి ఉగ్గుగా పోసాయి. కరుణ రసానికి పెట్టింది పేరైన రామాయణంలో శంబుకుడు ఈ కులం ముద్రతోనే చంప బడ్డాడు.

ఈ కులం పేరుతోనే పురోహితవర్గం విద్యను కొన్ని వేల సంవత్సరాలు గుత్తకు తీసుకొని జాతి మొత్తాన్ని నిర్వీర్యం చేసింది. ఈ కుల విద్యతోనే తమకు అలౌకిక శక్తులున్నట్లు, అమోఘమహిమలున్నట్లు కపటనటనలుచేసి సామాజిక ఆధిపత్యాన్ని చేపట్టి మిగిలిన వర్ణాలను అణగ ద్రొక్కి వైజ్ఞానిక పురోగమనానికి అడ్డుగోడగా నిలిచింది ఈవర్గం.

---

2. In Quest of freedom – Page 52
(హిందూ సమాజ వ్యవస్థ - కులాలు (వ్యాసం) - రావిపూడి)

చారిత్రకంగా మనం ఆలోచించినట్లయితే ఇనుము కనుగొనడంతో వ్యవసాయాభివృద్ధి జరిగింది. ఈ అభివృద్ధి సమాజంలో ప్రజా సమూహాలను సంచారదశనుండి స్థిరనివాసం ఏర్పడటానికి దోహదపడింది.

స్థిరపడిన ఈ సమాజంలో అనేక వృత్తులు బయల్దేరాయి. కాలక్రమేణ ఒక్కొక్క వృత్తి ఒక్కొక్క కులంగా స్థిరపడింది. ఈవృత్తులు కూడా విద్యలే అయినప్పటికి వీటికి విద్యా గౌరవం లేకుండా పోయింది. వృత్తి రీత్యా ఏర్పడిన కులాలు జన్మరీత్యా స్థిరపడ్డాయి. కాని వృత్తులు మారిపోయినప్పటికిని కులాలు మాత్రం మారలేదు.

వేదాన్ని వల్లించేవాడు తప్ప మిగిలిన వృత్తికారులు విద్యావేత్తలుగా గుర్తింపబడలేదు. వాళ్ళు "శూద్రులు" అనే నామంతో దాసులుగా లెక్కించబడినారు. ఈ సంప్రదాయం ఇప్పటికి సాగుతోంది.

అందువలన శూద్రులు వేదాధ్యయనమునకు అనర్హులుగా లెక్కించబడి ఎవడైనా వేదవిద్యను అభ్యసిస్తే వాడు శిరచ్ఛేదము గావింపబడినాడు. శంబుకుడు ఈ విధంగా వధింపబడ్డవాడే !

భారతంలో ద్రోణుడు ఏకలవ్యుని విద్యాసంపత్తిని కులం పేరుతో అనర్హుడుగా ప్రకటించి దోచుకున్నాడు. కాని ధర్మశాస్త్రం ప్రకారం ద్రోణుడు ఉత్తమ బ్రాహ్మణుడై కూడా తన విద్యను పొట్టకూటికి అమ్ముకున్నాడు, కులగోత్రాలులేని పాండవులకు విద్య చెప్పడంలో లేని ధర్మ ప్రసక్తి ఏకలవ్యునికి విద్య చెప్పడంలో ఎందుకు వచ్చిందో అర్థంకాదు. అయితే ఈ పురాణాలు బహుముఖాలుగా ప్రచారమై పురాణ పురుషులకే కులధర్మం తప్పలేదు. మనమెంత ? అనే భావానికి సమాజాన్ని తీసుకొచ్చాయి.

గీతను ప్రవచించి కులాన్ని మానవధర్మంగా నిర్దేశించిన కృష్ణుడు కులం పేరుతో రాజసూయ యాగంలో శిశుపాలుని చేత నిలవేయబడ్డాడు.

హరిశ్చంద్రుడు కులంకోసం రాజ్యాన్ని, భార్యని, కుమారుని, చివరకు తన్ను తాను కూడ అమ్ముకున్నాడు "వర్ణ సంకరపు రొంపిలి యేల చుట్టెదవు నా కంఠంబునం గౌశికా!" అని ఇప్పటికీ బలిజేపల్లి లక్ష్మీకాంతంగారి పద్యాలు పాడటం వింటూనే ఉన్నాంకదా!

అయితే యివన్నీ పురాణగాథలే ఇవన్నీ సత్యాలు కావు. కాని భారతీయ హృదయ పేటికలమీద ముద్రవేయ బడ్డవాళ్ళు వీళ్ళే కదా!

సూత కులజులచేత పెంచబడ్డ కారణం వలనే గదా కర్ణుడు ఎన్నో యిక్కట్లు పడ్డాడు. కాని భారతంలో కులాన్ని ప్రబోధించిన ఈ వ్యాసునకు కులమున్నట్లు కనబడదు. ఈతడు పరాశరుడనే మునికి బెస్త కన్యకు పుట్టాడు. పరాశరుడు: శక్తికి పంచమ యువతియైన అదృశ్యంతికి పుట్టాడు.

శక్తి: బ్రహ్మర్షియైన వశిష్ఠునికి మాదిగ యువతియైన అరుంధతికి జన్మించాడు.

పురుషులు ఋషులు; స్త్రీలు అస్పృశ్యలు

ఈ సందర్భంలోనే మనం మరొక్క విషయాన్నికూడ గమనించాలి

వీరికి పుట్టిన పురుష సంతానానికి గౌరవం వచ్చింది. స్త్రీలకు మాత్రం గౌరవం లేకుండా పోయింది

వేదాల్లో ఋషులు పురుష సంతానానికై దేవతల్ని వేడుకొనుటయు, పుత్రసంతతియే దేవతానుగ్రహముగాను, పుత్రసంతతి కలుగటయే దేవతలు తృప్తి పడినారనుటకు ఋజువుగాను భావించారు.

"ఉషస్తమస్యాం యశసం సువీరం
దాస ప్రవర్గం రయి మశ్వయుధ్యం.
(ఋగ్వేద సంహిత 1-92-8)

(ఓ ఉషో దేవతా! కీర్తితో కూడుకొనినట్టియు వీరులగు పుత్రా)దులు కలిగి నట్టియు దాసజన వర్గము కలిగి నట్టియు ఐశ్వర్యమును నేను పొందుదునుగాక)

అను మంత్రము ఈ విషయమును ఋజువు చేస్తున్నది. కేవలం అరుంధతిని, అదృశ్యంతిని, సత్యవతిని – వసిష్ఠుడు, శక్తి, పరాశరుడు వివాహమాడింది వారసత్వం కోసం, పురుషసంతానం కోసం, తద్వారా పున్నామ నరకం నుండి తప్పించుకోవడం కోసం, పితృకర్మలు జరిపించుకోవడం కోసం తండ్రికులంతోనే వీరు చలామణి అయ్యారు. తల్లులు మాత్రం అస్పృశ్యజాతివారుగా లెక్కించబడ్డారు. స్త్రీజాతిని పురుషజాతి ముఖ్యంగా సంతానోత్పత్తి కోసమే ఉపయోగించుకుంది. సంతానం కలిగిన తరువాత అది ఆడ సంతానమైతే అక్కడే వదలిపోయేవారేమో? "శకుంతల" మేనకా విశ్వామిత్రులచేత అట్లు విడువ బడిందే కదా? "ప్రజాయైగృహమేధినామ్" అన్నట్లు సంతానం కోసమే గృహస్థులు కావడం తద్వార వంశాన్ని నిలబెట్టుకోవడం వారు ధర్మంగా భావించారు. వంశం నిలవటానికి మూలకందమైన స్త్రీ మాత్రం త్రోసివేయబడేది.

(ఈ ఋషులు మాత్రం ఆర్య సంతతివారు – ఈ స్త్రీలు మాత్రం ఆర్యేతరులు అనేది ఇక్కడ అర్థమౌతుంది.)

ఈ వంశ తత్త్వం, జాతి తత్త్వం, వర్ణతత్త్వాలే భారతదేశంలో విభిన్న జీవన విధానాలకు పునాదులు వేసాయి. ఈ దేశానికి ఆర్యులు పారశీకులు, యవనులు, శకులు, కుషానులు, హూణులు, అహోములు,

అరబ్బులు, తురుష్కులు, ఇంకా ఎందరో వచ్చి స్థిరపడ్డారు. జాతి వైవిధ్యం,భాషావైవిధ్యం అందువలననే కొట్టవచ్చినట్లు కనబడుతోంది. 280 భాషలు 500 మాండలికాలు వాడుకలో ఉన్నాయి.

జాతిద్వేషం, భాషాద్వేషం, కులద్వేషం, ప్రాంతీయద్వేషం, మాండలిక ద్వేషం. మత ద్వేషాలతో నిరంతరం పోరాడుతుంటూ వున్న దేశాన్ని గూర్చి—

"ఏదేశమేగిన ఎందు కాలిడినా

పొగడరానీతల్లి భూమి భారతిని"

(రాయప్రోలు)

అంటూ మనం పొగుడుతున్నా! ఈ దేశంలో నివసిస్తున్న ప్రజలందరికి సామాజికంగా; ఆర్థికంగా ఒకే న్యాయం జరుగనంతవరకు ఇది 'భారతదేశం' అని చెప్పవచ్చేమోకాని, భారతజాతి' అంటానికి వీలులేదు.

ఈ వంశతత్వాన్ని, జాతి తత్వాన్ని, వర్ణతత్వాన్ని పెంచి పోషించినవారు ప్రధానంగా "ఆర్యులు, ఆర్యఋషులు" అనేది మనకు స్పష్టంగా తెలుస్తుంది.

అందువలననే "అంగిరసుడు, అగస్త్యుడు, భృగుడు, భరద్వాజుడు వసిష్ఠుడు, విశ్వామిత్రుడు మొదలైనవారు వేద వేదాంగాలలో వలెనే పురాణాలలోను మనకు కన్పిస్తారు. ఇవి వంశనామాలు కాబట్టి వీరికి సంబంధించిన ఏ వృత్తాంతమైనా, ఏ విశేషమైనా ఒకే వ్యక్తికి సంబంధించింది కావడానికి వీలులేదు."[3]

ఈ ఆర్యులే యీ దేశానికి తలమానికమైన సింధూ నాగరికతను ధ్వంసం చేసినట్లుగా కొందరు చరిత్రకారులు భావిస్తున్నారు. "గుర్రాలను

3. సీత జోస్యం (పీఠిక) (ఋషులెవరు?) పేజి 86_నార్ల

పూన్చిన రథాలతో, క్రొత్తతరహా గొడ్డళ్ళతో ఇక్కడకు చేరిన ఆర్యులు ధ్వంసం చేసింది హరప్పన్ నాగరికతకు చెందిన పురాలను మాత్రమే కాదు, దాని వ్యావసాయిక వ్యవస్థనుకూడ"[4] ఈ "ఆర్యులు వలసకు రావడానికి పూర్వం ఇక్కడ స్థిరపడిన వారిలో నీగ్రోలున్నారు నిషాదులున్నారు, కిరాతులున్నారు ద్రావిడులున్నారు. వీరందరిని కలగా పులగం చేసి దాసులనీ, దస్యులనీ వీరికి నామకరణం చేసారు. దాసుడు అనే పదానికి క్రమంగా "బానిస" "శూద్రుడు" అనే అర్థాలేర్పడ్డాయి. దస్యుడు అనేపదానికి "శత్రువు" చోరుడు' అనే అర్థాలేర్పడ్డాయి."[5]

ఋగ్వేదంలో వీరు ముఖ్యంగా కోరుకునే కోరికలు"దాసులను, దస్యులను, ఫణులను, అసురులను, అన్యులను వధించి వారి సిరి సంపదలు దోచుకోగల బలదర్పాలు కావాలని"[6] అందువలన ఆర్యులు ఈ దేశానికి రాకముందే ఇక్కడ జీవనం చేస్తున్న "నీగ్రిటోలు" ఆర్యుల చేత ఓడింపబడి, నగర జీవితానికి దూరంగా ఈ నాటికి బ్రతుకులు గడుపుతున్నారు.

"వీరే ప్రాచీన శిలాయుగ నిర్మాతలు. ప్రస్తుతం అంగామీ నాగజాతులు. (అస్సాం), రాజమహల్ కొండ జాతులు (తూర్పు బీహార్) ఏనాదులు (ఆంధ్ర), ఎరుంబలు (తమిళనాడు), ఇరులలు, (వైనాడు), పాంయన్‌లు (కొచ్చిన్-తిరువాన్కూర్) నీగ్రి టోల సంతతి వారు."[7]

4. ,, ( ,, ) (ఋషుల కుట్రలలో రాముని పాత్ర) 99 పేజి నార్ల
5. ,, ( ,, ) (రాక్షసులెవరు?) పేజి 70 నార్ల
6. ,, ( ,, ) (ఋషులెవరు?) పేజి 92 నార్ల
7. భారత దేశ చరిత్ర - సంస్కృతి. ప్ర. భా. పేజి. 15.
(తెలుగు అకాడమీ హైదరాబాదు - 1977)

అరబ్బులు, తురుష్కులు, ఇంకా ఎందరో వచ్చి స్థిరపడ్డారు. జాతి వైవిధ్యం, భాషావైవిధ్యం అందువలననే కొట్టవచ్చినట్లు కనబడుతోంది. 280 భాషలు 500 మాండలీకాలు వాడుకలో ఉన్నాయి.

జాతిద్వేషం, భాషాద్వేషం, కులద్వేషం, ప్రాంతీయద్వేషం, మాండలిక ద్వేషం. మత ద్వేషాలతో నిరంతరం పోరాడుకుంటూ వున్న దేశాన్ని గూర్చి—

"ఏదేశమేగిన ఎందు కాలిడినా

పొగడరానీతల్లి భూమి భారతిని"

(రాయప్రోలు)

అంటు మనం పొగుడుకున్నా! ఈ దేశంలో నివసిస్తున్న ప్రజలందరికి సామాజికంగా; ఆర్థికంగా ఒకే న్యాయం జరుగనంతవరకు ఇది 'భారతదేశం' అని చెప్పవచ్చేమోకాని, భారతజాతి' అంటానికి వీలులేదు.

ఈ వంశతత్వాన్ని, జాతి తత్వాన్ని, వర్ణతత్వాన్ని పెంచి పోషించినవారు ప్రధానంగా "ఆర్యులు, ఆర్యఋషులు" అనేది మనకు స్పష్టంగా తెలుస్తుంది.

అందువలననే "అంగిరసుడు, అగస్త్యుడు, భృగుడు, భరద్వాజుడు వసిష్ఠుడు, విశ్వామిత్రుడు మొదలైనవారు వేద వేదాంగాలలో వలెనే పురాణాలలోను మనకు కన్పిస్తారు. ఇవి వంశనామాలు కాబట్టి వీరికి సంబంధించిన ఏ వృత్తాంతమైనా, ఏ విశేషమైనా ఒకే వ్యక్తికి సంబంధించింది కావడానికి వీలులేదు."[3]

ఈ ఆర్యులే యీ దేశానికి తలమానికమైన సింధూ నాగరికతను ధ్వంసంచేసినట్లుగా కొందరు చరిత్రకారులు భావిస్తున్నారు. "గుత్తాలను

---

3. సీత జోస్యం (పీఠిక) (ఋషులెవరు?) పేజి 86—నార్ల

వ్రాసిన రథాలతో, క్రొత్తతరహా గొడ్డళ్ళతో ఇక్కడకు చేరిన ఆర్యులు ధ్వంసం చేసింది హారప్పన్ నాగరికతకు చెందిన పురాలను మాత్రమేకాదు, దాని వ్యావసాయిక వ్యవస్థనుకూడ"[4] ఈ "ఆర్యులు వలసకు రావడానికి పూర్వం ఇక్కడ స్థిరపడిన వారిలో నీగ్రోలున్నారు నిషాదులున్నారు, కిరాతులున్నారు ద్రావిడులున్నారు. వీరందరిని కలగా పులగం చేసి దాసులనీ, దస్యులనీ వీరికి నామకరణం చేసారు. దాసుడు అనే పదానికి క్రమంగా "బానిస" "శూద్రుడు" అనే అర్థాలేర్పడ్డాయి. దస్యుడు అనేపదానికి "శత్రువు" చోరుడు' అనే అర్థాలేర్పడ్డాయి."[5]

ఋగ్వేదంలో వీరు ముఖ్యంగా కోరుకునే కోరికలు "దాసులను, దస్యులను, పణులను, అసురులను, అన్యులను వధించి వారి సిరి సంపదలు దోచుకోగల బలదర్పాలుకావాలని"[6] అందువలన ఆర్యులు ఈ దేశానికి రాకముందే ఇక్కడ జీవనం చేస్తున్న "నీగ్రిటోలు" ఆర్యుల చేత ఓడింపబడి, నగర జీవితానికి దూరంగా ఈ నాటికి బ్రతుకులు గడుపుతున్నారు.

"వీరే ప్రాచీన శిలాయుగ నిర్మాతలు. ప్రస్తుతం అంగామీ నాగజాతులు. (అస్సాం), రాజమహల్ కొండ జాతులు (తూర్పు బీహార్) ఏనాదులు (ఆంధ్ర), ఎరుంబలు (తమిళనాడు), ఇరులలు, (వైనాడు), పాంయన్‌లు (కొచ్చిన్-తిరువాన్కూర్) నీగ్రి టోల సంతతి వారు."[7]

---

4. ,, ( ,, ) (ఋషుల కుట్రలలో రాముని పాత్ర) 99 పేజి నార్ల
5. ,, ( ,, ) (రాక్షసులెవరు?) పేజి 70 నార్ల
6. ,, ( ,, ) (ఋషులెవరు?) పేజి 92 నార్ల
7. భారతదేశ చరిత్ర - సంసకృతి. ప్ర. భా. పేజి. 15.

(తెలుగు అకాడమీ హైదరాబాదు - 1977)

"సుమారు రెండుకోట్ల మందిగల అపరాధ తెగలుగా, కోటిన్నర మందిగల ఆదిమవాసుల తెగలుగా"[8] బ్రతుకుతున్న ఈ గిరిజనులు అప్పటిలాగే ఇంకా నాగరికతకు దూరంగా ఉన్నారు. ఆర్యేతరమైన ప్రాచీన భారతీయ సంస్కృతి ఇంకా వీరిలోనిలచివుంది. భారత జాతి, భారత సంస్కృతి అనిఅరచే వాడెవ్వడు వారిని గురించి పట్టించు కున్నట్లు కనబడదు. వారిజీవితాలకు ఆర్థిక సామాజిక న్యాయం చేకూర్చడానికి విప్లవకారులెందరో తమప్రాణాలర్పించారు. ఇప్పటికిని అర్పిస్తున్నారు. కానివీరిమీద సానుభూతిగాని, భారతదేశానికి ప్రాచీనులు వీళ్ళే అనే ఆలోచనగాని ఎవరికీ రావటంలేదు.

పైగా ఆర్యులు రామాయణాది కావ్యాల్లో వీరిని రాక్షసులని, అసురులని వికృతంగా వర్ణించారు. ఆర్య-అనార్య యుద్ధాలనే రామ-రావణ యుద్ధాలుగా వర్ణించినట్లు చరిత్రకారులు భావిస్తున్నారు. "మధ్య భారతానికి చెందిన ఈ నిషాదులనే రామాయణం రాక్షసులుగా వర్ణించిందని"[9] "యమ్. వి. కిబే, జి. యన్. హీరాలాల్, టి. పరమశివ అయ్యర్, టి. అమృతలింగం, డి. ఆర్. మన్కడ్, అరుణా కుమార్ ఘోష్ భావిస్తున్నారని నార్ల వారు చెబుతున్నారు. అంతే కాక భారతీయ ప్రాచీన నాగరికతకు నమూనాగా ఉన్న సింధూనగర వ్యవస్థ ఈ గణవ్యవస్థశిధిలాలనుండియే ఏర్పడి ఉంటుందని దేవి ప్రసాద్‌ఛటోపాధ్యాయ 'లోకాయత' లో నొక్కి చెప్తున్నారు.

---

8. అస్పృశ్యు లెవరు ? (ఆముఖం) డా॥ అంబేద్కర్.
9. సీత జోస్యం. (పీఠిక) [రాక్షసులెవ్వరు] - నార్ల -

"కనీసం ఐదు వేల యేండ్ల క్రితం సింధులోయలో "రాజ్యము" యొక్క ఆవిర్భావానికి భారతదేశం సాక్షీభూతం. ప్రాచీన గణసంస్థల శిథిలాలపై ఇదివచ్చితీరాలి; ఈ ప్రక్రియ ఎలా జరిగిందో మన చరిత్రకారులు ఇంకా మనకు కచ్చితంగా చెప్పవలసి ఉంది."

["India witnessed the rise of the State in the Indus Valley atleast five thousand years ago, This must have been or the ruins of the tribal organisations, though our historians are yet to tell us exactly you the process operated "][10]

ఈ తెగలు ఇప్పటికి భారతదేశంలో పలు ప్రాంతాల్లో ఉన్నారు. మధ్య భారత దేశంలోని ఆదిమవాసులు భారత ఉపఖండములోని మధ్య ప్రాంతంలో గుంపులుగా . గుజరాతునుండి మధ్యప్రదేశ్ వరకు, వ్యాపించియున్నారు.

"భారత దేశంలోని ఆదిమవాసులలో వీరు అధిక సంఖ్యాకులు. వీరి ప్రధాన సంఖ్యాబలము ఇరుగు పొరుగుగావున్న నాలుగు రాష్ట్రాలలో మధ్యప్రదేశ్ – బీహార్, ఒరిస్సా బొంబే విదర్భలలో కేంద్రీకృతమై యున్నది.

గోండులు (Gond) – 30 లక్షలపైన
ఓరన్‌లు (oren) – 10 లక్షలు
ముండా (Munda) – 6 లక్షల 50 వేలు
ఖ్వారియ (kharia) – లక్షా 50 వేలు
కవార్ (kawar) – 3 లక్షలు దాదాపు
సవర (savara) – 6 లక్షల 50 వేలు
ఖోండ్ (khond) – 7 లక్షల 50 వేలు

---

10. Lokayata–Debi Prsaad Chatto Padahyaya. (Pge. 125

మధ్య భారతమునకు పశ్చిమంగా

కొర్కు (korku) – 2 లక్షలు దాగాపు

భిల్ (Bhil) – 22 లక్షలు

భిలాల (Bhilala) – 25 లక్షలు

మీయోమీనా (Meo-Mina) – 8 లక్షలు

ఈశాన్య ప్రాంతంలో–

సంతాల్ (santal) – 25 లక్షలు

ఇంకా 'హో' అనే పేరుగల తెగలు కనిపిస్తాయి. అంతేగాక ఈముఖ్య తెగలకు మధ్య అక్కడక్కడా 200 చిన్న అప్రధానపు తెగలున్నాయి.[11]

"ప్రపంచములోని అతి ప్రాచీన తెగలలో కొన్ని దక్షిణ భారతంలో కనిపిస్తాయి. మానవ పరిణామ శాస్త్రంలో మిక్కిలి వెనుకబడినవిగా పరిగణింపబడు తెగలలో సిలోన్‌లోని వెడ్డాల్ మనకు చాలా దగ్గరగా నున్నారు. కాని కేరళలోని నీలాంపూర్ అడవులలోని అరండా అనునట్టి కొన్ని దక్షిణ భారత తెగలు 'వెడ్డాలు' కంటే ప్రాచీనమైనవి. అరండానులకు యీనాటికికూడా అతి ప్రాచీన వ్యవసాయ సూత్రాలు తెలియవు ఆహారంకోసం వారు కందమూలాలు మరియు చిన్న జంతువులమీద ఆధారపడతారు.

మైదాన ప్రజలు అడవి ప్రాంతంలోనికి చొచ్చుకు పోవుటతో ఎక్కువ మంది అరండానులకు వ్యవసాయ అటవీ కార్మికులుగా ఉపాధి దొరికింది, గత శతాబ్దందాకా యీ దౌర్భాగ్యపు తెగల వాళ్ళకు గుడిసె వేసుకోవటంకూడా తెలియక బండసందులలో ఉండేవారు. (వారు 200 మంది కంటె తక్కువ) ఇంతటి అధోగతిలో అణచి ఉపేక్షింప బడ్డవారు మనకెచ్చట కనిపించరు.

వారు ఎంతగా అధోగతిలో అణచబడి ఉపేక్షింప బడినారంటే ప్రపంచములోని ఏ భాగములో కూడ ఇంతకంటె ఎక్కువగా అణచ బడిన చిన్న తెగల గురించి ఊహించుట సాధ్యముకాదు. అదే తాలూకాలో అరండానులకంటె కొంచెం మెరుగుగా ఉన్న అరడజను ఇతర తెగలున్నవి, ముఖ్యంగా వర్షాకాలంలో కందమూలాదులు వెతుక్కోవటంలో కాలహరణం కష్టం అయినప్పటికి అడవివారికి ఆహారం సమకూరుస్తుంది. [12]

పూర్వ భారతములో నివసిస్తున్న తెగలలో వివిధమైన జీవిత విధానాలున్నాయి. ఈశాన్యభారతంలో ఆది (నాగ) అనే తెగవారు ముఖ్యంగా వ్యవసాయంమీద ఆధారపడి జీవిస్తున్నారు. వీరు వ్యవసాయంలో నాగలిని ఉపయోగించరు. ఒరిస్సాలోకూడ జూంగ్ లేదా కొండజాతి తెగలు నాగలి ఉపయోగించకుండానే 'పోడు' వ్యవసాయం మీద ఆధారపడి జీవిస్తున్నారు. ఒరిస్సాలో కాని, మధ్యభారతంలో కాని నివసిస్తున్న ప్రజలు నాగలినుపయోగించి వ్యవసాయం చేస్తున్నారు. వారి చుట్టూ నాగలితో వ్యవసాయం చేస్తుంటే వీరింకా • 'పోడు' వ్యవసాయంలోనే ఉండటం గమనించదగిన విషయం. అస్సాంలో నివసిస్తున్న కొండజాతులు మనకు ఇతర తెగలకంటే భిన్నంగా కనిపిస్తున్నారు.

---

• గిరిజనులు కొండలపై గల అడవులనరికి నాగలితో దున్నకుండాచేసే వ్యవసాయం పోడు వ్యవసాయం. తరువాత వారు మూడు సంవత్సరాలకు ఒక్కసారి స్థలాలు మారుస్తారు.

11. Tribe caste and Religion [Central indian tribes] ...... STEPHENFUCHS.

12. Tribe, caste and Religion (Tribes in the south) A. AIYAPPAN

# ఆంధ్రప్రదేశ్ లోని యానాదులు

ఆర్యుల దురాక్రమణకు బలియైన అతి ప్రాచీన భారతజాతులలో నీగ్రిటోలు ఒకరు. వీరు అరేబియా, ఇరాన్, బెలూచి స్థాన్‌ల మీదుగా ఆఫ్రికా నుంచి భారతదేశానికి వచ్చారు. వీరు పాతరాతి యుగంలో జీవించారు. కాయలు, దుంపలతో మాత్రమే బ్రతికారు. రాతితో తయారుచేసిన మోటు పరికరాలు ఉండేవి. ఆంధ్రప్రదేశ్ కు చెందిన యానాదులు 'కరంబులు' ఈజాతికి చెందినవారే. ప్రాచీన భారతీయులైన నీగ్రిటోలను గూర్చి చరిత్రకారులు చెప్పిన జీవిత విధానాలు శ్రీహరికోట ద్వీపంలోని యానాదులలో కనిపిస్తున్నాయి. 1976 లెక్కల ప్రకారము ఈ ద్వీపంలో వీళ్ళు 'ఎనిమిది' ప్రదేశాల్లో 600 మంది నివసిస్తున్నారు.

మొదటిగా వీరిని 1843వ సంవత్సరములో బ్రిటిష్‌వాళ్ళు చూడటం జరిగింది. బ్రిటిష్‌వారు యానాదుల్ని గురించి "ఈ ద్వీపంలో యానాదులు గుడ్డలు లేకుండా అడవులలో జంతువులవలె తిరుగుచున్నారు." అని చెప్పియున్నారు. ఇప్పుడు వీళ్ళు ఉప్పుడు బియ్యపు అన్నం తింటారు. అయితే మొట్టమొదటగా వీళ్ళు బియ్యం చూసింది బ్రిటిష్‌వారు ఈ ద్వీపానికి వచ్చినతరువాతనే అంతకుముందు వీళ్ళు అడవులలో దొరికే దుంపలు, పండ్లు, ఆకులు, చిన్న చిన్న చేపలు, ఉడుములు, అడవి పందులు, కుందేళ్ళు, పక్షులు, కోయిలలు తినేవారు. బ్రిటిష్‌వాళ్ళు వృక్ష సంపదను పెంచడం ప్రారంభించిన తరువాత కట్టెలు కొట్టడం మొదలగు పనులకు వీరిని ఉపయోగించడం తత్ఫలితంగా వారు వీరికి ఉప్పుడుబియ్యం, గోచిపాతలు ఇవ్వడం ప్రారంభమైంది. ఆంగ్లేయులు వీరితో సంబంధాలు పెట్టుకొని వేటనుండి వీరిని కట్టెలు కొట్టడం మొ॥ పనుల వైపుకు దృష్టిని మలిపారు. వ్యవసాయం నేర్పించాలని ప్రయత్నించారు కాని వీలుకాలేదు.

స్వాతంత్ర్యం వచ్చినతరువాత బయటరైతులకి వీరిలో కొందరికి సంబంధాలు మొదలయినయ్. దానితో రైతు యానాదులు – సర్కారు యానాదులుగా వీరు వ్యవహరించ బడ్డారు.

వీరు చుట్టుగుడిసెల్లో ఉంటారు. అడవి వెంపలితో ఈ గుడిసెలు కడతారు. ఈ గుడిసెవేయడం అందరికి తెలుసు. ఒక్కపూటలోనే వీరు ఈ గుడిసెలు నిర్మించుకోగలరు. అప్పుడప్పుడు ఆగుడిసెల్ని వదలి పెట్టి వేరే స్థలానికి వెళ్ళి గుడిసెలు నిర్మించుకొంటారు.

ఆలుమగలు, పిల్లలు కుటుంబంగా ఉంటారు. పెళ్ళయిన వెంటనే వీళ్ళు ప్రత్యేక కుటుంబంగా చీలిపోతారు. దానితో ఉమ్మడి కుటుం-బాలు లేవు.

వీరికి వివాహం సాంఘిక ఒప్పందం. స్వేచ్ఛగా వివాహాలు జరుగుతుంటాయి. పెద్దలు నిర్ణయించిన వివాహాలుగూడ జరుగు తుంటాయి. సాంఘికంగా ఏ విధమైన కట్టుబాట్లు వీరికిలేవు. వీరికి వివాహతంతు ఏమి ఉండదు. ఒక ఆడ మగ కలసిపోవడమే పెండ్లి. అంత మాత్రాన వావి వరుసలు లేవనికాదు, మేనమామ మేనత్త బిడ్డల్ని చేసుకోవడానికే వీళ్ళు ఇష్టపడతారు.

ఎవరిచేతైనా దెబ్బతిన్నట్లైతే దెబ్బతిన్నవాడు తాతయ్య(దేవుడు) చేత కొట్టబడతాడు అనే విచిత్రమైన నమ్మకం వీరికిఉంది ఈనమ్మకమే వీళ్ళవ్యక్తిత్వాన్ని హరించింది. నాగరిక ప్రపంచంతో దూరంగా ఉండే టట్లుగా ఇది అడ్డుకుండి. వీరికి ఈ ప్రపంచంకాక ఈ భూమికిపైన మనకు కనిపించని ప్రపంచం ఒకటి ఉందని, దానిమీద దేవతలు తిరుగుతుంటా రని నమ్మకం. వీరికి రెండు రకాల దేవుళ్ళున్నారు మేలుచేసే దేవుళ్ళు, హానిచేసే దేవుళ్ళు. మనకు పగలు ఆ దేవుళ్ళకురాత్రి అని వారినమ్మకం.

ఆ లోకంలో తాతయ్య ఉన్నాడు; వాడు మనకు వ్రాతలు వ్రాస్తుంటా డని వారి విశ్వాసం. మనిషిలో మూడు ప్రాణాలు ఉన్నాయని తలలో, గుండెలో, మిగిలిన శరీరంలో మూడు ప్రాణాలు ఉంటాయని, చని పోయిన తరువాత శరీరంలో ప్రాణం దెయ్యం రూపంలో తిరుగు తోందని, తాతయ్య దగ్గరకు తలలో ప్రాణం పోతుందని గుండెలో ప్రాణం పెద్దల దగ్గరకు పోతుందని వీరి విశ్వాసం. చనిపోయిన మన పెద్దలంతా మనకు కనిపించని ప్రపంచంలో ఉంటారని, కర్మ చేసే వరకు చచ్చి పోయినవాడు పెద్దలలో కలవడని వారు నమ్ముతారు. పెళ్ళి కాకముందు చనిపోతే దేవత లవుతారని వారి విశ్వాసం.

ముఖ్యంగా వీళ్ళు జబ్బులు దేవతలవల్ల, దెయ్యాలవల్ల వస్తాయని నమ్ముతారు.

వీరికి సాయంత్రం అప్పుడు వారికి ఉదయం అవుతుంది; కాబట్టి దేవతలు ఉదయం స్నానానికి వెళ్ళేటప్పుడు ఎదురు వెళితే జబ్బులు వస్తాయని వీరినమ్మకం.

దయ్యాలు ప్రాణాన్ని తింటాయని అవి తినడంప్రారంభించి నపుడే జబ్బులు వస్తాయని వీరివిశ్వాసం. అందుకే వీళ్ళు జబ్బులు వచ్చినపుడు రంగం (పూజ) పెడతారు. దేవుళ్ళను పిలిచి అడుగుతారు వాళ్ళు ఏ మందులు (మూలికలు) చెబితే అవి వాడతారు. ఈరంగానికి ప్రత్యేకంగా పెద్దలుఉంటారు. వాళ్ళంటే వీరికి గౌరవం. ఇప్పుడిప్పుడే హిందూమతాచారాలు కొన్ని వీరిలో జొరబడు తున్నాయి.

యానాదులు-ద్రావిడభాషల ప్రభావం ఎక్కువపడిన ఒకరకమైన యాసతో కూడిన తెలుగును మాట్లాడుతారు. వీరు ఏణాది పండుగ ఏడాదికొకసారి చేస్తారు. (ఇది ఏడాదినుండి వచ్చివుంటుంది.)

వీళ్ళు అనాది వాళ్ళు కావడం వలనే వీరికి యానాదులు అనేపేరు వచ్చి ఉంటుందని కొంతమంది భావన.

వీళ్ళు వైద్యం చేయించుకోవడానికి డాక్టర్ల దగ్గరకుపోరు. వీరిలో వైద్యం సరిగాలేక చిన్నపిల్లల మరణాలు ఎక్కువగా ఉన్నాయి. డాక్టరు ఇంటికువెళ్ళి మందులు ఇచ్చేపద్ధతి ఇక్కడ వీరిపై పరిశోధనలు చేస్తున్న మానవ శాస్త్రకారులు ఇప్పుడే ఏర్పాటు చేసారు.

వీరికి దాదాపుగా విద్యలేదు. స్వాతంత్ర్యానంతరం 'టక్కర్ బాబా'గారు ఒక స్కూలుపెట్టి నాలుగు సంవత్సరాలలో నలుగురికి నాలుగవ తరగతి వరకు చెప్పగలిగారు. మరల 1976లో మానవ శాస్త్రవేత్తలు స్కూలుపెట్టి మరల నలుగురికి ఐదవ తరగతి వరకు చెప్పగలిగారు. వీరికి విద్యాగంధం లేనంతవరకూ వీరు మానవ నాగరికతకు దూరంగా ఉండవలసిందే. *

మొత్తంమీద మనం ఆలోచించినపుడు ఆర్యుల దురాక్రమణకు గురియైన ప్రాచీన భారతీయులు ఆర్యులకు దూరంగా ఉండి ఆటవిక జీవితంలో తెగలుగా జీవించారు. ఆర్యసమాజ వ్యవస్థలో బానిసలుగా కొంతమంది బ్రతికారు. ఈ తెగలు నగర జీవితానికి దూరంగా ఉండి. ఆటవిక అనాగరిక దశల్లోనే జీవించారు. అయితే కొన్ని తెగలు సమాజంతో సంబంధం పెట్టుకొని సమాజంలో నీచంగా చూడబడ్డారు, నీచమైన పనులకు ఉపయోగించబడ్డారు. కేవలం ఆంధ్ర ప్రదేశ్‌లో నివసిస్తున్న షెడ్యూల్డు తెగలలో ప్రభుత్వం వారు ప్రకటించినవి. ఇచ్చట వివరించబడు తున్నాయి.

---

* 22-11-80 శనివారం సాయంత్రం 4 గంటలకు శ్రీహరికోటలో మానవ సామాజిక శాస్త్రవేత్త పి. సి. గురివిరెడ్డి గారితో జరిపిన ఇంటర్వ్యూలో తెలిసిన విషయము.

# ఆంధ్ర ప్రదేశ్‌లోని షెడ్యూల్డు తెగలు

1. అంధ్
2. బగత
3. భిల్
4. చెంచు, చెంచువారు
5. గదబలు
6. గోండు, నాయక్‌పోడు. రాజగోండు
7. గౌడు (ఏజెన్సీ ప్రాంతములలో)
8. కొండరెడ్లు (Hill Reddies)
9. జాతాపులు
10. కమ్మర
11. కట్టునాయకన్
12. కోలం, మన్నెవార్లు
13. కొండదొరలు
14. కొండకాపులు
15. కొండరెడ్లు
16. కోండులు. కోడి, కోదు, దేశీయకోండులు. డోంగ్రియ కోండులు, కుట్టియకోండులు, టిక్కిరియకోండులు. మేనిటికోండులు.
17. కోటియ, బెంతొఒరియ, బార్తిక, ధులియ, బులియ, హోల్వా, పైకో, పుటియ, సన్రోన, సిధోపైకో.
18. కోయ, గౌడ్, రాజ, రాషకోయ, లింగధారికోయ, (మామూలు) కొట్టుకోయ, భైనెకోయ. రాజకోయ.
19. కులియ
20. మాలి (అదిలాబాదు, హైదరాబాదు, కరీంనగర్, ఖమ్మం, మహబూబ్‌నగర్, నిజామాబాద్, మెదక్, నల్గొండ మరియు వరంగల్లు జిల్లాలలో మినహా)

21. మన్నెదొర
22. ముకదొర, మూకదొర
23. నాయకాలు (ఏజన్సీ ప్రాంతములలో)
24. పర్ధాన్
25. పోర్జ, పరంగిపెర్జ
26. రెడ్డిదొరలు
27. రోణ, రేణ
28. సవరలు, కాపుసవరులు, మాలియసవరులు, కుట్టో సవరులు
29. సుగాలీలు, లంబాడీలు
30. తోటి (అదిలాబాద్, హైదరాబాదు, కరీంనగర్, ఖమ్మం, మహబూబ్‌నగర్, మెదక్, నల్గొండ, నిజామాబాద్ మరియు వరంగల్ జిల్లాలలో)
31. వాల్మీకి (ఏజన్సీ ప్రాంతములలో)
32. యానాదులు
33. ఎరుకలు

వీరుగాక ప్రభుత్వంచేత గుర్తింపబడని తెగలు ఇంకా ఉన్నారు. ఒక్కసారి ఆలోచించండి. నాగరికతకు దూరంగా బ్రతుకుతున్న ఈ అభాగ్యులకు విద్య చెప్పించడానికి మన ప్రభుత్వం ఎంత ప్రయత్నించింది? వీరికి ఎన్ని భూములు పంచింది? వీరి సంస్కృతిని పెంచడానికి ఎంతమంది మానవశాస్త్రకారుల్ని పంపింది? ఎన్ని వైద్యశాలలు నిర్మించింది? అసలు వీళ్ళను మనుష్యులుగా లెక్కించిందా! వీరిపై మానవతాదృష్టిని ప్రసరింపజేసిందా! అవేమి లేకపోగా కొందరు భూస్వాములు వీరు నివసించే ప్రదేశాలకు వెళ్ళి వారిచేతే గొడ్డుచాకిరీ చేయించి, అడవులు నరికించి వారికి నామమాత్రం కూలి ఇస్తూ, వారి బలహీనతలను కనిపెట్టి, ఆ బలహీనత బాధాకరంగా వారి

జుట్టు వీరి చేతిలో పెట్టుకొని, వారి శ్రమశక్తిని దోచుకుంటున్నారు. వీరి జీవితాల్లో వెలుగును తెద్దామని ప్రయత్నించిన వారి జీవితాల నార్పుతున్నారు. రోజూ ఎదురు కాల్పుల్లో చనిపోయే విప్లవవీరులు వీళ్ళే. స్వతంత్ర భారతదేశంలో నేతలు సామాజిక ఆర్థిక న్యాయాన్ని ప్రసాదించమని అడిగేవాడి గుండెలుతీసి నెత్తురు తాగుతారన్నమాట. ఇదెక్కడి న్యాయమో అర్థంకాదు.

ఆర్యుల దురాక్రమణలకు పరాజితులై వారికి దూరంగా బ్రతికినవారు ఈ తెగలవారు కాగా ఆర్యులచేత జయించబడి ఆ సామాజిక వ్యవస్థలోనే ఇమిడిపోయి, దాసులుగా బ్రతికినవారు శూద్రులుకాగా, వర్ణసంకరం పేరుతో- కృత్రిమ సామాజిక వ్యవస్థా దౌష్ట్యాన్ని పగలగొట్టాలని ఎదురుతిరిగారనే కోపంతో, ఊరికి దూరంగా శ్మశానానికి దగ్గరగా తరమబడినవారు. అంటరానివారు, వీరే గాంధీగారు ముద్దుగా పిలిచిన హరిజనులు. ఈ విష్ణుపుత్రులు భారత మాత వక్షం మీద రాచపుండుల్లా ప్రతిపల్లెకు చివర ఉన్నారు. ఈ కర్మ భూమిలోని ధర్మవీరుల మృష్టాన్న భోజనాల్లో వీళ్ళ గంజిబువ్వ కలిసి పోయింది. పట్టుపుట్టాల్లో వీళ్ళ ముతకపంచెలు ఇమిడిపోయినయి, వాళ్ళ మేడ మిద్దెల్లో వీళ్ళ పూరిగుడిసెలు మిళితమయినయ్. అందుకే వీళ్ళకు కూడు లేదు. గుడ్డలేదు, గుడిసెలేదు. మూతికి ముంత; మొలకు తాటాకు మాత్రం తగిలించారు. కొన్నివందల సంవత్సరాలు మనిషిని పశువుగా చూశారు. విద్యకు, విజ్ఞానానికి. నాగరికతకు, నగరజీవితానికి, కూటికి, గుడ్డకు, సౌఖ్యానికి దూరంగా ఉంచారు. ప్రకృతిసిద్ధమైన సంపదల్ని కూడా అనుభవించకుండా చేశారు. కూటికి దూరంగా కాటికి దగ్గరగా తరిమారు.

తెల్లగుడ్డ వేసుకోవద్దన్నారు
తెల్లబువ్వ తినకుండ చేశారు.
అవర్ణుడవు నువ్వు సువర్ణం ముట్టుకో గూడదన్నారు

ఈవిధంగా వెలివేయబడి అస్పృశ్యులుగా బ్రతుకుతున్న కులాలు- ఒక్క- ఆంధ్రప్రదేశ్ లోనే-

## ఆంధ్రప్రదేశ్‌లోని షెడ్యూల్డు కులములు.

1) ఆదిఆంధ్ర
2) ఆదిద్రావిడ
3) అనాముక్
4) ఆరెమాల
5) అరుంధతీయ
6) అరవమాల
7) బారికి
8) బావురి
9) బేడజంగం. బుడ్గజంగం
10) బైండ్ల
11) బ్యాగర
12) చచాటి
13) చలవాధి
14) చామర్, మోచి, ముచి
15) చంభార్
16) చండాల
17) డక్కల్, డోక్కల్‌వార్
18) దండాసి
19) ధోర్
31) మదాసికురువ, మదారికురవ
32) మాదిగ
33) మాదిగదాసు, మాష్టీన్
34) మహార్
35) మాల
36) మాలదాసరి
37) మాలదాసు
38) మాలహన్నాయి
39) మాలజంగం
40) మాలమస్తి
41) మాలసాలె, నేత్కాని
42) మాలసన్యాసి
43) మాంగ్
44) మాంగ్‌గరోడి
45) మన్నె
46) మష్టి
47) మాతంగి
48) మెహతారు
49) మిథఅయ్యల్వారు

20) డోమ్, డోంబర, పైడి. పానో
21) ఎల్లమల్వార్, ఎల్లమ్మలవాండ్లు
22) ఘాసి, హడ్డి, రెల్లిచాచండి
23) గొడగలి
24) గొడారి
25) గోసంగి
26) హోలెయ
27) హోలెయదాసరి
28) జగ్గలి
29) జాంబువులు
30) కొలుపులవాండ్లు
50) ముండాల
51) పాకి, మోతి, తోటి
52) పంబాడ, పంబండ
53) పమిడి
54) పంచమ, పరియా
55) రెల్లి
56) సమగార
57) సంబన్
58) సైత్రపు
59) సింధోళ్ళు, సిందోళ్ళు

వీరి సంఖ్యాబలం షుమారు మొత్తము జనాభాలో నూటికి 20 మంది. వీరిప్పుడు ఈ నిచ్చెనమెట్ల సమాజంలో నిచ్చెన మోస్తున్న అభాగ్యులు - నిచ్చెనమీద ఉన్న నాలుగువర్ణాలు, ఆయా రాజకీయ, సాంఘీక, ఆర్థిక పరిస్థితులనుబట్టి పైకి క్రిందికి మారుతున్నారు. కాని వీరుమాత్రం నిచ్చెన మోస్తూనే ఉన్నారు. డా! అంబేడ్కర్ వంటి విప్లవమూర్తులు వీరిని దాస్యవిముక్తుల చేయాలని ప్రయత్నించారు. కాని వీరి భుజాలు కాయలుగాచి వీళ్ళు మొయ్యడానికి అలవాటుపడ్డారు. దాస్యభావ సంకెలలు త్రెంచుకొని, సామాజిక,

---

♦ భారతరాష్ట్రపతిచే ప్రకటించబడిన 1976 వ సంవత్సరపు షెడ్యూల్డు కులములు మరియు షెడ్యూల్డు తెగల జాబితాల సవరణా ఉత్తరువు ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లోని షెడ్యూల్డు కులములు మరియు షెడ్యూల్డు తెగల జాబితా 1981 జనాభా గణన కార్యక్రమము కొరకు ప్రచురించబడినవి. (షెడ్యూల్డుకులములు తరవాతఇవ్వబడినవి)

ఆర్థిక న్యాయంకోసం పోరాటం చేసే ధైర్యం వీరికి లేకుండాపోయింది. ఈనాటికీ వీరిలో నూటికి 20 మందికికూడా విద్యాగంధం లేదు. నూటికి ఐదుగురికి కూడా భూమిలేదు. స్వాతంత్ర్యానంతరం వీరి అభ్యున్నతికి పాటుపడతామని హామీ యిచ్చిన పార్టీలకు వీళ్ళు పునాదిరాళ్ళుగా ఉన్నారు; వీళ్ళు పునాదుల్లోనే ఉన్నారు. పునాదుల మీద భవనాలు వాళ్ళు నిర్మించుకొన్నారు. ఈనాటి ఆర్థిక దోపిడికి కూడా కులమే ప్రధానస్థానము వహిస్తోంది.

తొగలుగా, అస్పృశ్యులుగా, శూద్రులుగా, సామాజిక దోపిడికి గురియైన ఈ అభాగ్యులు కులం పరిధి చెరిపివేసి మానవసమాజాన్ని నిర్మించుకోవాలంటే ఈ కులం ఎట్లా పుట్టింది? ఎట్లా పెరిగింది? ఏ పునాదులమీద దీని నిర్మాణం అనే విషయాన్ని మూలాల్లో కెళ్ళి తెలుసుకోవాలి. అప్పుడే ఆ పునాదుల్ని త్రవ్వి పారవేయ గలుగుతారు.

అందుకే ముందుకు పదండి.

కులం మూలాల్లోకి పోదాం!

# కులవ్యవస్థ – నిర్వచనాలు

కులం పుట్టుకనుగూర్చి చరిత్రకారులు పలురకాలుగా భావించారు. ప్రొఫెసర్ రాప్సన్ అభిప్రాయం ప్రకారం "కులవ్యవస్థ ప్రారంభానికి ఆర్యుల, ఆదివాసుల తెలుపు, నలుపు దేహచ్ఛాయలోని తేడా కారణంగా ఉంది. ఆదిలో సమాజం ఆర్యులు – అనార్యులనే రెండు భాగాలుగా విభజింపబడింది.

"The origin of the caste system is due to the distinction between the white and dark complexion of the Aryans and the original residents. Originally, society was divided into two parts, the Aryans and the non-Aryans". [1]

"డాక్టరు గోఖలే" ప్రకారం "కులవ్యవస్థను వర్ణించుటకు ప్రయోగింపబడిన పదజాలం వర్ణం, జాతి, అంటే రంగు (శరీర), పుట్టుక. మొదటి రెండుమాటలు 'జాతిభేదాన్ని' సూచిస్తాయి. తర్వాత రెండు మాటలు 'పుట్టుక' 'వంశం' తెల్పుతాయి. ఆర్య, అనార్యులమధ్య జాతిభేదాన్ని స్పష్టపరచడానికే 'ఆర్య వర్ణం' 'దస్య వర్ణం' పదాలు మొదట ప్రయోగంలోకి వచ్చాయి. ఇవి ఋగ్వేదంలో ఈ అర్థంతోనే ఉపయోగింప బడ్డాయి. ఆర్య అనార్యులమధ్య రంగు, మతము, ఆచార వ్యవహారాలలో సమూలమైన వ్యత్యాసాలతో దండయాత్రికులుగా ఆర్యులు భారతదేశానికి వచ్చినప్పుడు, ఆర్య సమాజంలో మొట్టమొదట స్థూలమైన సాముదాయికీకరణ జరిగింది. రాజకీయంగా ఆర్యులు విజేతలు, అనార్యులు పరాజితులు. జాతిపరంగా ఆర్యులు మంచి వర్చస్సుగలవారు, అనార్యులు నలుపు." ఈ విభేదమే కుల (వర్ణ) వ్యవస్థకు దారితీసింది.

---

1. History of India : V. D. Mahajan Page :86

("According to Dr. Gokhale, the Indian terms used to describe the caste system are varna and Jati, complexion and birth. The former refers to racial difference and the latter means 'birth'' and "descent". It was to mark of the racial difference between the Aryans and non-Aryans that the terms Arya-Varna and 'Das-Varna' first came into use, and they are used as such in the Rigveda When the Aryans came to India. as invaders with radical differences in complexion, religion, customs and manners between them and the non-Aryan inhabitants, there came about the first broad grouping in the Aryan society. Politically, the Aryans were the conquerors and the non-Aryans the conquered and racially the former were of a fair complexion whereas the latter were dark.) 2.

వి. ఎ, స్మిత్ (V. A. Smith) అభిప్రాయం ప్రకారం "ఆచార పరిశుద్ధత, ప్రత్యేకించి ఆహార వివాహ విషయంలో పాటింపుకు, విలక్షణ నియమాలచే అంతరంగికంగా ఒకటిగా చేయ బడిన కుటుంబాల సముదాయము కుల"మని నిర్వచింపవచ్చు.

(......... a caste may be defined as "a group of families internally united by peculiar rules for the observance of ceremonial purity, especially in the matter of diet and marriage". 3 )

శ్యామ శాస్త్రిగారి మాటల్లో "ఆహార, వివాహ సంబంధమైన సాంఘిక వినాయింపు తత్త్వమే కులమునకు అర్థం. పుట్టుక, ఆచార కాండ ద్వితీయం."

According to Shama Sastri "Caste means a social exclusiveness with reference to diet and marriage. Birth and rituals are secondary'. 4

---

2. History of India : V. D. Mahajan Page : 86
3. Ibid Page : 86.
4. Ibid Page : 86.

# వర్ణశబ్ద నిర్వచనము

"వర్ణ" శబ్దార్థమును విచారింతము. ఈ వర్ణశబ్దము నామలింగాను శాసనములో మూడుచోట్ల ఉపయోగింపబడినది. ఈ మూడుచోట్ల లింగాభట్టీయ మీవిధముగా అర్థము చెప్పుచున్నది.

1. వర్ణః, వర్ణ్యంతే కపిలారుణపీత కృష్ణ వర్ణాః నిరూప్యంత యితవర్ణాః వర్ణనుతా. 2, వర్ణ్యతే చిత్రవర్ణత్వేనేతివర్ణః వర్ణస్తుతౌ. 3. వర్ణ్యతే; వర్ణయతిచవర్ణః.

ఈ మూడర్థములలో మొదటి యర్థమొక్కటియే యిచట నన్వయించునుగాన వర్ణమనగా 'రంగు' అని యర్థము తేలుచున్నది. ఒపలి రంగునుబట్టి బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణములు ప్రత్యేకింప బడినట్లు స్పష్టమగుచున్నది.

కపిలవర్ణం బ్రాహ్మణుడు, అరుణ వర్ణం క్షత్రియుడు, గోధుమ వర్ణం వైశ్యుడు, కృష్ణ వర్ణం శూద్రుడు అని యీ నిర్వచనము చెబుతుంది.

---

• ఈ వర్ణములలో జేరని పంచమునికి అవర్ణుడని వ్యవహారము. ఇతని దేహచ్ఛాయనుబట్టి వర్ణమును నిర్ణయించక పోవడాన్ని గూర్చి ఆలోచింపవలసియున్నది.

# వర్ణవ్యవస్థ - పునాదులు

"బ్రాహ్మణో అస్య ముఖమాసీద్, బాహూరాజన్య కృతః ।
ఊరూతదస్యయద్ వైశ్యః పద్భ్యా శూద్రో అజాయత॥"

(విరాట్ పురుషుని ముఖము బ్రాహ్మణులాయెను. బాహువులు క్షత్రియులాయెను. ఊరువులు వైశ్యులాయెను. పాదములు శూద్రులాయెను.*) అని పురుష సూక్తంలో వ్రాయబడింది ఋగ్వేదమందలి 10 వ మండలంలోని ఈ సూక్తంలోనే మనకు - వర్ణవ్యవస్థకు పునాదులు కనిపిస్తున్నాయి.[1] అంతకుముందుకాలంలో జన్మనుబట్టి వర్ణవ్యవస్థ ఉన్నట్లుగ మనకు ఆధారాలు దొరకడంలేదు[2] పైగా 9 వ మండలంలో[3] ఒక ఋక్కు ఆధారంగా ఒకే కుటుంబంలో సభ్యులే వివిధ వృత్తులను స్వీకరించినట్లుగా తెలుస్తుంది.

---

* అయితే, ఈ శరీర భాగాలనుండి, వీరుపుట్టారని అనంతర దశలో అర్థం చెప్పబడింది.

[1] డా॥ బడే కృష్ణఘోషు ఋగ్వేద భాషను గురించి (The vedic Age page 336) మొత్తంమీద మొదటి తొమ్మిది మండలములభాష సమానంగా వుంది. అక్కడక్కడ మాత్రం ర, ల, భేదముంది. పదవమండలం భాషాదృష్టితోను, ఇతర విషయాలలోను, ఇటీవలది అని విద్వాంసుల అభిప్రాయం. మొదటి తొమ్మిది మండలాలలో నాల్గు వర్ణములపేర్లులేవు. కాని పదవమండలంలో ఉన్నవి." అని అన్నాడు (ఋగ్వేదఆర్యులు పేజి 57)

[2] బ్రాహ్మణులు. పురోహితులు, ఋగ్వేద ఆరంభకాలంలో వున్నారు. కాని వారుకూడ ఇతర ఆర్యులవలె యుద్ధంలో పాల్గొనేవారు. భరద్వాజుడు, వసిష్ఠుడు, విశ్వామిత్రుని పుత్రులు, వంశీకులు, దివోదాసు, సుదాసులయొక్క అనేక యుద్ధాలలో పాల్గొని ఆయుధాలను ప్రయో

చారిత్రకదృష్టితో చూచునప్పుడు - ఆర్యులు ఈ దేశంలోకి పశుపాలకులుగా ప్రవేశించారు. గోపాలకులు (గోవులను పరిపాలించే వారు) గవేషణ * (గోవులను వెతకడం) గోపతి (గోవులకధిపతి) గోమేధం (గోవుతోచేయుయజ్ఞం) గో ఘ్నుడు (అతిధిగావచ్చి గోవులను చంపించువాడు) గోత్రం♦ (గోశాల) అనివారిని వెన్నాడుతూ వచ్చిన ఈ విశేషణాలే వారివృత్తిని ప్రకటిస్తున్నాయి.

ఈ ఆర్యులు క్రీస్తుపూర్వం 1000 ప్రాంతంలో పంజాబ్ నుండి తూర్పుకు బయలుదేరారు. వీరు ఏనుగులను ఎద్దులను మచ్చికచేశారు. రథాలు, గుఱ్ఱాలు, గోవులు, అంతకుముందే వీరికి తెలుసు.

ఈ కాలంలోనే ఇనుము (తేలికరకం) కనిపెట్టబడింది. వ్యవసాయానికి ఇనుప ములికి తగిలించబడిన నాగలి ఉపయోగించడం ప్రారంభమైంది. అంతకు ముందువరకు గోసంపదమీద ఆధారపడిన ఆర్యులు వ్యవసాయంలోకి జొరబడ్డారు. ఈ వ్యవసాయం సమాజంలో ఒక విప్లవాత్మకమైన మార్పును తీసుకొచ్చింది. "అంతకుపూర్వం

---

గించారు. నాడు బ్రాహ్మణులకు, క్షత్రియులకు భేదము లేదు. ఉపనిషత్కాలంలోను, తర్వాత కాలంలోను లేక యీపురుష సూక్త ములో వున్నట్లు మొదట్లో అటువంటి భేదములేదు. (ఋగ్వేదఆర్యులు పేజి 57)

' నేను కవిని, నాతండ్రి వైద్యుడు. నాతల్లి పిండివిసురుతుంది సంపదకోసం మేము వివిధ వృత్తులు చేస్తున్నాము

* ఈ శబ్దం పరిశోధించుట అనే అర్థంలో ఇప్పుడు వాడబడుతుంది

♦ కులాలలో గోత్రం ఈ శబ్దంనుండి వచ్చిందే

ఉండిన ఆటవిక సమాజాలు చాలాపరిమితంగా ఉండి కొంతలో కొంత సంచార జీవితం గడిపేవనిమనం ఊహించుకోవచ్చు."[4]

కాని సమాజంలో వ్యవసాయం తీసుకొచ్చినమార్పు స్థిరజీవితాన్ని సాధ్యం చెయ్యటమేగాక "ఒకమనిషి పదిమందికి సరిపడే ఆహారం ఉత్పత్తిచెయ్యడంతో తొంభైశాతం సామాజికులు ఆహారోత్పత్తి నుంచి విముక్తులయ్యారు. ఈ తొంభైశాతంనుంచి వివిధ వృత్తులవాళ్ళు రకరకాల వినియోగవస్తువులను సృష్టించి, సమిష్టి జీవితాన్ని ఆర్థికంగా మెరుగుపరచగా, ఇందులోనుంచే జ్ఞానసముపార్జకులు, పరిపాలకులూ రావటం అవసరమైంది. ఎందుకంటే రెండు డజన్లమంది గల ఆటవిక దళానికి శాసనాలూ, పరిపాలనా అవసరంలేదు. ఒక నాయకుడుచాలు కానీ రెండువందల గ్రామాలు ఒకే సమాజంక్రిందికి వచ్చేసరికి, పాలకుడు, అతని సహాయకులు, అతని ప్రతినిధులూ, శాసనాలు, శిక్షాస్మృతి వగైరాలతో కూడిన "రాజ్యాంగం" అవసరమయింది. వర్గాలుఏర్పడ్డాయి. దానితోపాటు శ్రమ దోపిడీకూడా సాగింది."[5]

ఈ విధంగా ఏర్పడిన సమాజంలో ఆర్యులచేత జయింపబడిన అనార్య తెగలు, సేవకులుగా వినియోగింపబడి, తరువాత బానిసలుగా పిలువబడ్డారు. "ఓడిపోయిన శత్రువుల స్త్రీ–పురుషులను ఎక్కువ మందిని గెల్చుకొన్నవారు దాస దాసీలుగా చేసుకొని పనిచేయించుకొనేవారు."[6] "ఋగ్వేదకాలంలో గెల్చినవారికి, ఓడినవారికి రూపంలో రంగులో, స్వార్థత్వంలో చాలా తేడా ఉన్నది. కావుననాడు బానిస విధానం చాలా క్రూరంగావున్నదనుట వాస్తవం. బాలఖిల్యసూక్తముల్లో (14–8–8–3) పృషధ్రఋషి ఇంద్రుని ప్రార్థిస్తూ 'తనకు నూరు గాడిదలు, నూరుగొర్రెలు, నూరుగురు 'దాసులను' ఇవ్వమని కోరాడు,

4. 5. కళలు–శాస్త్రీయ విజ్ఞానం–(ఈనాటి కులవ్యవస్థ) కొడవటిగంటి కుటుంబరావు

6. ఋగ్వేద ఆర్యులు    పుట 56

మొత్తంమీద దాసదస్యులకు * ఆర్యులతోవున్న రంగుతేడా మొదట వర్ణశబ్దం వుపయోగించడానికి హేతువైంది. అయితే కేవలం ఇది రంగుభేదంమాత్రమేకాదు. ఆచారాలలోను మతాలలోను, ఆలోచనలలోను, ఆహారవిహారాలలోను వీరికి వారికివున్న తీవ్రమైన భేదం వర్ణభేదానికి దారితీసింది.*

ఈవాదాన్ని బలపరుస్తూ త్రిపురనేని రామస్వామిగారు తమ 'సూతపురాణ' కావ్యపీఠికలో యిలావ్రాశారు

"ఆర్యులు శ్వేతాంగులు, ద్రావిడులు కాలాంగులు వీరిరువురి రక్తసాంకర్యముచే కలిగిన ప్రసవముయొక్క దేహచ్ఛాయ రకరకములుగనుండును...... ఈ కారణముచేతనే ఆర్యులందు వర్ణవిభాగ మేర్పడవలసి వచ్చెను" [9] అందువలన బ్రాహ్మణులుమాత్రం తెల్లనివారుగావుండి క్షత్రియ, వైశ్యకులములవారు మాత్రము ఎరుపు, పసుపురంగులవారైరని వీరివాదము

పెక్కురు పరిశోధకులు ఆర్యులచేత జయించబడి బానిసలుగా మారినవాళ్ళే శూద్రులపేరుతో నీచంగా పశువులుగా చూడబడి నాల్గవ వర్ణంగా లెక్కించబడ్డారని, సామాజిక నిర్మాణంలో విద్యాగురుత్వం, పరిపాలన, వ్యాపారం ఆర్యులేపోస్వీకరించి ఆయా బాధ్యతలనుబట్టి వారు మూడువర్ణాలుగా చీలిపోయారని, "ఆర్యాశ్త్రై వర్ణికాః"అనే గౌతమధర్మసూత్రం యీకాలములోనే వచ్చివుంటుందని, అభిప్రాయ పడ్డారు.

అయితే వీరిలో మూడవ వర్ణంగా ఉన్న వైశ్యులు ద్రావిడ జాతులకు సంబంధించిన 'పణులనే' వాదముంది. వీరు కిరాత, పర్వత

---

*(డా॥ గోఖలే అభిప్రాయము)

9 సూతపురాణం — తృతీయాశ్వాసం 3 వ పేజి

జాతులకు చెందినవారుగా ఋగ్వేద ఋషులు పేర్కొన్నారు. పణులను పేర్కొన్నవారిలో భరద్వాజుడు, వసిష్ఠుడు, దీర్ఘతముడు, గోతముడు వామదేవుడు, గృత్సమదుడు, హిరణ్యస్తూపుడు అసితదేవలుడు మున్నగు ఋషులు గణింపదగినవారు. అగ్ని (ధనికులైన) పణుల ధనమపహరించునని వృద్ధ భరద్వాజుడు చెప్పుచున్నాడు.

ఓం వసత్పతిః శవసాహంతి వృత్రమగ్నే విప్రో విపణేర్భాతివాజం।
యస్త్వం ప్రచేత ఋతయా సజోషసాన త్వపాం హవింషి

(ఋగ్వేదం 6–13–3)

ఓ సత్పతివైనయగ్నీ। నీబలముచే వృత్రుని వధింపజేయగలవు. విప్రుడవై పణియొక్క ధనమును గ్రహించునటుల చేయుదవు. యజ్ఞము కొఱకై జన్మించిన నీవు ఎవరినెటుల ప్రేరేపించిన నటుల చేయగలరు. భరద్వాజుడు పణులను హింసింపుమని పూషను ప్రేరేపించుచున్నాడు

ఓం పరితృన్ధిపణీ నామారయా హృదయాకవే। అధేమస్మభ్యం
రంధయ

(ఋగ్వేదం 6–53–5)

ప్రాజ్ఞుడవైన ఓ పూషా ! లుబ్ధులైన వణిజుల హృదయములను ఆరెపముతో వేధింపుము. తర్వాత వీరలను మా వశమొనర్పుము.

అసిత దేవలుడు సోమునితో "పణుల గోవులను, ద్రవ్యమును హరింపు"మని చెప్పాడు. (7–22–7)

బంధువనువాడు కృపణులైన పణులపై దాడి వెడలుటకై ప్రోత్సహించినాడు.

ఓం అగస్త్యస్య నద్భ్యః సప్తీయునక్షి రోహితా।
పణీ న్యక్రమీదభి విశ్వాన్రార జన్నరాధసః॥

ఓ రాజా! అగస్త్యుని బంధువులకొరకై ఎఱ్ఱని గుఱ్ఱములు కట్టిన రథముపై వెడలి దాతలు గానట్టి పణిసమూహమును పరాజితుల నొనర్పుము.

అయితే ఈ పణులు రానురాను ఆర్యులకు ఆర్యసంస్కృతికి వశులై పోయి ఆర్యీకరణమైన సంస్కృతితో వారిలో మూడవ వర్ణంగా కలిచి ఆయా కాలాలనుబట్టి వాళ్ళ చేత గౌరవాగౌరవాలు పొందుతూ వచ్చారు అని తలంచవచ్చు. పాలకవర్గాలకు లోబడి పై వర్ణాలతోనే కలిసిపోయారనికూడా తలంచవచ్చును.

మొత్తంమీద జాతిపరంగాను, వృత్తిపరంగాను ఆర్యులకు ఆర్యేతరులకు వున్న భేదాలతోపాటు పాలక పాలిత భేదము, యాజ మాన్య బానిసవర్గ భేదము — చాతుర్వర్ణ్య వ్యవస్థాపునాదుల్ని గట్టి పరచినవి అని చెప్పవచ్చు.

ఈ విధమైన సామాజిక నిర్మాణంతో ఏర్పడిన రాచరికపు వ్యవస్థ బలపడేకొద్దీ ఈ చాతుర్వర్ణ్య వ్యవస్థ చిక్కబడి పోయింది. వైదిక కర్మకాండ, ఆర్యఋషిపూజ అధికమైనాయి. కర్మ, పూర్వజన్మ మొదలగునవి వర్ణ వ్యవస్థను మతపరంగా స్థిరీకరించాయి. శూద్రుల పేరుతో సమస్త వృత్తికారులు నిరాకరించ బడ్డారు. దీనితో నిచ్చెన మెట్ల సమాజం ఏర్పడింది. రాజులు తమ అరాచకత్వానికి ఎదురుతిరిగ కుండా ఈ వర్ణవ్యవస్థ పునాదులు గట్టిపరచారు. వర్ణధర్మాలు ఋషులు నిర్దేశించారు. వర్ణధర్మం శాసనబద్ధం చేయబడింది. రాజులు వర్ణ ధర్మశాసనాలను క్రూరంగా అమలు జరిపారు. వర్ణవ్యవస్థ మానవ కల్పితంకాదని, దైవమే సుఖజీవనంకోసం మనుష్యులను వర్ణాలుగా సృష్టించిందని నూరిపోశారు. దానితో క్రింది వర్ణాలవారిలో ఎదురుతిరిగే మనస్తత్వం చచ్చింది. దాస్యం, సహనం, శ్రమించడం, శ్రమదోపిడీని నివారించకపోవడంవంటి గుణాలు సహజంగా అలవడ్డాయి. దానితో వర్ణ వ్యవస్థతోపాటు దోపిడీవ్యవస్థకుకూడ పునాదులు ఏర్పడ్డాయి. వర్ణంపేరుతో సామాజికంగా, ఆర్థికంగా దోపిడీ ప్రారంభమైంది. దోచుకునే వర్ణాల సుఖ - సౌఖ్యాలకోసం దోయ్యబడే వర్ణాలకు

కట్టుబాట్ల శృంఖలాలు తగిలించారు. విభిన్న వృత్తులవారిని విభిన్న కులాలుగా చీల్చి వీరిలో వీరికి తీవ్రభేదాలు సృష్టించి కులాలసంఖ్యను పెంచుతూ వచ్చారు. ప్రతి కులానికి మతపరంగా ఏదో భాష్యం చెబుతూ పైమూడు వర్ణాలు, క్రింద అనేక కులాలుగా చీలిన శూద్రులను అణచి, వారి శ్రమశక్తితో సుఖజీవనం చేశారు.[10] భారతదేశంలో నానాటికి హిందూమత తాత్విక పునాదులమీద కట్టబడిన ఈ కులవ్యవస్థ హిందూమతానికి గుండెకాయలా తయారయింది.

అందువల్ల హిందూధర్మ గ్రంథాలన్నీ ఈ వర్ణవ్యవస్థా విషవృక్షాన్ని పెంచి పెద్దచేసి, దాని వేళ్ళు, ఊడలు భారతీయ హృదయక్షేత్రాల్లో అంతరాంతరాల్లోకి చొచ్చుకుపోయేటట్లు చేశాయి. "కులాలుగా ఉపకులాలుగా శాఖోపశాఖలుగా చీలిన సమాజం అంతర్గత ఘర్షణలతో క్షీణించ సాగింది. కులాంతర వివాహాలు నిషేధించ బడ్డాయి. కులాంతర్గత (Internal) వివాహాలు మాత్రమే చట్టబద్ధమై కులాలకు శాశ్వతత్వం ఏర్పడింది. అంతస్సంపర్కం (Endogamy) కారణంగా జాతి శారీరకంగా, మానసికంగా, వాంఛనీయమైన సహజపరిణామం పొందలేక నిర్వీర్యమై పరిణామ మార్గం నియంత్రించబడి సంకుచితమై పోయింది. అధికారం చెలాయించేవారు ఐహికంగామాత్రమే కాకుండా ఆముష్మికంగా, పారలౌకికంగాకూడ అధిపతులై కూర్చున్నారు. తిరుగులేని మానసిక బానిసత్వం సమాజమంతా ఆవరించి హిందూమత రక్షణకొరకు అభేద్యమయిన కవచం యేర్పడింది. అగ్రవర్ణం, అంతిమవర్ణం అనే విచక్షణ లేకుండా హిందూమతస్థులందరిలోనూ కులవ్యవస్థపట్ల అసంకల్పిత మానసిక దాస్యభావం పరా

---

10 "కులవ్యవస్థ వివిధజాతుల విభజనకాదు. కులవ్యవస్థ ఒకేజాతికి చెందినవారిని వివిధవర్ణాలుగా విభజించిన సాంఘికవిధానం మాత్రమే" (కులనిర్మూలన పుట-41)

ధీనతాభావం అలవడింది. భిన్నభావాలపట్ల అసహనం ప్రబలింది." 11 సంకుచిత తత్వంతో మనిషికి సహజసిద్ధమైన స్వేచ్ఛను హరించిన ఈ కులవ్యవస్థమీద ప్రారంభంనుండి తిరుగుబాటు జరుగుతూనే వుంది.పరశురాముడు పుట్టుకతో బ్రాహ్మణుడైనప్పటికీ వృత్తిరీత్యా క్షత్రియుడు. విశ్వామిత్రుడు పుట్టుకతో క్షత్రియుడైనప్పటికీ బ్రహ్మర్షి కాగలిగాడు. ఋషులలో ప్రసిద్ధుడు వసిష్ఠుడు వేశ్యాపుత్రుడు. భారతం వ్రాసిన వ్యాసుడు బెస్తకన్యకొడుకు. న్యాయధర్మాన్ని రచించిన పరాశరుడు చండాల కన్యకొడుకు. అలాగే ఎందరో వర్ణ సంకరజనులు తిరుగుబాటు ప్రకటించారు. కొందరు కులపరిధినుంచి తప్పుకోడానికి మనుష్యులకు పుట్టినట్లు కాక పశుజన్మలుగా ప్రకటించుకున్నారు. ఇటులనే కొందరు పక్షిజన్మలుగా యోనిజులుగా ప్రకటించుకున్నారు. కొందరు ఉత్తములైన - ఋషులు - రాజులు — గురువులు అయోనిజులుగా ప్రకటించుకున్నారు. వారిలో —

వసిష్ఠుడు :- సప్తఋషులలో ఒకడు, ఒకనాడు సూర్యుడును వరుణుడును గలిసివచ్చుచు మార్గమున ఊర్వశిని జూచిరి. ఆమె సుందరాకారము చూచుటతోడనే వారికి రేతః పతనమయ్యెను. ఊర్వశి వారి వీర్యములనొక కుంభమందు భద్రము చేసెను. అందుండియే వసిష్ఠుడును, అగస్త్యుడును పుట్టిరి.

వసిష్ఠుడు:-

శ్లో॥ గణికా గర్భసంభూతో
వసిష్ఠశ్చ మహామునిః
తపసా బ్రాహ్మణోజాత
స్సంస్కార స్తత్ర కారణమ్.

---

11 నాస్తికత్వం - నాస్తితత్వం — రావిపూడి వెంకటాద్రి పేజి 14,15

శ్లో॥ జాతో వ్యాసస్తు కైవర్త్యా
శ్వపాక్యాస్తు పరాశరః
బహవోఽన్యేపి విప్రత్వం
ప్రాప్తాయే పూర్యమద్విజాః

గీ॥ 'వేశ్యసుతుఁడు వసిష్ఠుండు విప్రుఁడయ్యె
దపముచే సంస్కృతియె యందు ధర్మమగుచు"
"జాలరికి వ్యాసుఁడును బరాశరుఁడు మాలె
తకుసుతులు ద్విజులైరి లెక్కకిదిమించె."

ఇట్లు పూర్వము అవర్ణులైకూడా బ్రాహ్మణులుగా ప్రకటించుకొన్నవారు పెక్కురు గలరు.

ద్రోణుఁడు:- భరద్వాజుఁడు ఘృతాచిని చూచుటచే అతని చిత్తము చంచలమై రేతఃపతన మయ్యెను. అందుండి జన్మించిన కుమారుఁడే ద్రోణుఁడు.

ద్రుపదుఁడు:- పృషతుఁడు తపస్సు చేసికొనుచు దగ్గర పువ్వులేరుకొనుచుండిన మేనకను చూచెను. అంతఅతనికి అంత రేతస్ఖలన మయ్యెను. దానిని తన పాదముతో కప్పియుండెను. అందుండి ద్రుపదుఁడు జన్మించెను."[12]

కాని సందేహాస్పదమైన ఇలాంటి పౌరాణికాంశాలను ఆశ్రయించవలసిన అవసరంలేకున్న చారిత్రక పరిణామంలో ఈ కుల వ్యవస్థకు వ్యతిరేకంగా పోరాడిన లోకాయత జైనబౌద్ధ విప్లవాలను గురించి తెలుసుకుందాం.

---

12. పూర్యగాథాలహరి 216, 217, 398. పేజీలు.
శ్రీ వేమూరి శ్రీనివాసరావు

# లోకాయతం-తాత్విక విప్లవం

లోకేషు ఆయత=లోకాయత అనగా ప్రజలలో వ్యాపించింది.[1] ప్రపంచాన్ని గురించి సూటిగా చెప్పేది. స్పష్టంగా చెప్పాలంటే ప్రాచీన భౌతికవాదమే లోకాయతం. ప్రాచీన భౌతిక వాదులే లోకాయతులు. బ్రాహ్మణ మతం ద్వారా విమర్శింపబడిన లోకాయత తత్వంద్వారా, లోకాయతం వివరించబడింది. దీనికి సంబంధించిన గ్రంథాలేవీ మనకు లభ్యంకాక పోవుటచే దీన్ని వ్యతిరేకించినవారి సాహిత్యం ద్వారానే దీన్ని మనం తెలిసుకోగల్గుతున్నాం.

బ్రాహ్మణులు రాజులను తమ చేతిలో ఉంచుకొని హిందూ మత వ్యతిరేకులను, వర్ణవ్యవస్థకు వ్యతిరేకులను తలలు తీయించి, కళ్ళు తోడించి వీరి వర్ణ దురహంకార మహాయజ్ఞంలో బూడిదచేశా రనేది సత్యం.

అయినా ఈ చార్వాకులు ఎదురుతిరిగి ప్రశ్నించడాన్ని నేర్పారు. ప్రశ్నిస్తే పాషండుడు; శంకిస్తే చార్వాకుడు; ఆలోచిస్తే అవాచ్యుడు అని మత వాదులంటున్నా వర్ణవ్యవస్థకు మూలమైన కర్మ మీద, మోక్షంమీద వీళ్ళు తార్కికంగా ఆలోచించి ప్రశ్నించారు.

భౌతిక ప్రపంచాన్ని పునాదిగా చేసికొని తత్వాన్వేషణ గావించిన వీరు మానవులందర్ని ఒక దృష్టితో చూడగలిగారు. మానవు

---

1. 14 వ శతాబ్దంలో మధ్వాచార్యుడు వ్రాసిన 'సర్వసంగ్రహము'ను గ్రంథాన్ని అనువదించిన E. B. కోవెల్ (Cowell) అను ఆయన అంగీకరించారు, H. D. శాస్త్రి అనే ఆయనకూడా 'ప్రజల ప్రాపంచికజ్ఞానము' అనే అర్థాన్ని తెలుపుతోంది అన్నారు. ("లోకాయత" దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ)

లందరికి ఒకే తత్వాన్ని ప్రవచించగలిగారు. అందుకే ఈ తత్వం ప్రజలకు బాగాదగ్గరయి ఆలోచింపచేసింది.

'Thus Lokayata meant not only the Philosophy of ahe people but also the Philosophy of this-worldliness or materia. lism.' [2]

షడ్దర్శన సముచ్చయములో హరి భద్రసూరిగారు వీరి సిద్ధాంతాన్నిగూర్చి ఈ విధంగా చెప్పుచున్నాడు.

'లోకాయతావదంత్యేవం నాస్తి దేవో ననిర్వృతిః
ధర్మాధర్మౌన విద్యేతే న ఫలం పుణ్య పాపయోః'

లోకాయతులగు నాస్తికులిట్లందురు. "సర్వజ్ఞుడైన దేవుడులేడు. మోక్షములేదు. ధర్మా ధర్మములుగాని, పుణ్యపాపములుగాని లేవు. కావున వీటివలన వచ్చు స్వర్గనరకాది రూప ఫలములు లేవు" స్థూలంగా ఇది ఆనాటి లోకాయతుల సిద్ధాంతమనుకోవచ్చు.

అయితే కులాన్ని సరాసరి నిర్మూలించలేము. కారణం ఈ కులం హిందూమతాన్ని, ఆ మతం హిందూదేవుళ్ళని, ఆ దేవుళ్ళు స్వర్గనరకాల్ని ఆశ్రయించి ఉన్నారు. కాబట్టి చార్వాకులు దైవభావాన్ని తొలగిస్తే కాని ఈ కులమతాలు పోవని భావించి దైవాన్ని, మోక్షాన్ని, కర్మని ప్రశ్నించారు. తద్వారా సామాజిక దోపిడీని ఎదిరించారు.

వారి సిద్ధాంతానికి తాత్విక పునాదిగా భౌతికవాదాన్ని చాటిచెప్పారు.

"ఏతావానేవ లోకో ఽ యం యావానింద్రియగోచరః
భద్రే ! వృకపదం పశ్యయద్వదంతి బహుశ్రుతాః "॥

2. LOKAYATA. Page: 3 DEBIPRASAD CHATTOPADHYAYA

ఈ లోకము పంచేంద్రియములకు ఎంత గోచరమగుచున్నదో అంతమాత్రమే ఉన్నది. పంచేంద్రియములు వ్యక్తీకరించు వస్తుజాతమునకు భిన్నమైనది లేదు. (ఇక్కడ లోకమనగా లోకమందలి పదార్థసంచయమని తెలియవలెను.)

దృశ్యమానమగుచున్న ప్రపంచమునకు భిన్నమైనది లేదని వక్కాణించారు.

పొట్టకూటికోసమే బ్రాహ్మణులు చచ్చిపోయినతర్వాత ఇంకొక లోకముందని ఆలోకానికి పోవాలంటే ఈ ధర్మాలను ఆచరించాలని ప్రబోధించారు. అని తెలిసికొని—

"త తశ్చ జీవనోపాయో బ్రాహ్మణై ర్విహిత స్త్విహ
మృతానాం ప్రేతకార్యాణి నత్వన్య ద్విద్యతేక్వచిత్."

మనుష్యులు మరణించిన తర్వాత శ్రాద్ధము మొదలైన కర్మలను బ్రాహ్మణులు తమ జీవనోపాధికోసం సృష్టించారు. అని చార్వాకులు వక్కాణించారు.

వైదికమతంవలె ఈ చార్వాకంకూడా అతి ప్రాచీనమైంది. దీన్నికొందరు లోకాయత మన్నారు. కొందరు చార్వాకమన్నారు. కొందరుబార్హస్పత్య మన్నారు. కొందరు దేహాత్మవాదమన్నారు. కొందరు నాస్తిక వాదమన్నారు. కొందరు స్వభావవాదమన్నారు. ఆధ్యాత్మిక, అభౌతిక వాదాలను నిరాకరించి, ప్రత్యక్ష ప్రమాణానికి నిలువని దార్శనిక వాఙ్మయాన్ని ఖండించి, శాస్త్రీయ సిద్ధాంతానికి భౌతికవాదానికి పునాదులు వేసిన ఈ సిద్ధాంతం మొట్టమొదటి సామాజిక అవగాహనగల తాత్విక విప్లవోద్యమం అనటంలో అత్యుక్తి లేదు. అందుచేతనే ప్రొఫెసర్ జయస్వాల్ "దేశ్యవుకి,

చావుకీ వ్యతిరేకంగా కిరాతకత్వానికి కులానికి వ్యతిరేకంగా పోరాటం చేయండని మీరు ప్రజలకు ఉద్బోధించారు" అని వ్యాఖ్యానించారు.

కులాన్ని జన్మనుబట్టి స్థిరీకరించి, కులాన్నిబట్టి మనుష్యులను వర్గీకరించి, రాజుల ఆర్థికదోపిడీకి బ్రాహ్మణుల సామాజిక దోపిడీకి అనువుగా సామాజిక వ్యవస్థను పటిష్టంచేసి, రాజుల అరాచకాన్ని ఎదిరించడానికి వీలులేకుండా ప్రజా సమూహ సంద్రాన్ని కులాల పిల్లకాలువలుగా చీల్చి ఆధిపత్యానికి, అధీనభావానికి మధ్య జరగవలసిన పోరాటాల్ని — కులానికి కులానికి మధ్య జరిగేటట్లు వక్రీకరించి వర్గపోరాట తత్వాన్ని చంపి, కులపోరాట తత్వాన్ని పెంచిన హిందూ పురోహితదుష్ట తత్వాన్ని ఎదిరించి పోరాడిన ప్రజాఉద్యమంఇది.

"విశ్వంలోని సర్వస్వానికీ జిజ్ఞాసతో వివరణయిస్తూ, అన్ని తాత్విక చింతలనూ అధిగమిస్తూ వచ్చిన లోకాయతం"[3] వైజ్ఞానిక విప్లవం అనడంలో అత్యుక్తిలేదు —

అందువలననే ఈ తాత్విక విప్లవవాదుల్ని మతవాదులు వాళ్ళ నోటిదగ్గర కూడు తీసివేస్తున్నారనే అక్కసుతో అవాచ్యమైన మాటలతో దూషించారు. అందువలననే ఈ సిద్ధాంతాన్ని అభిమానించువారెవ్వరని మతవాదులు చెప్పారంటే-

"విపరీత వేదాంతులు, దొంగ ముష్టుల మాయలాడులు, మగని బాసిన మగువలు. పతి జీవించియుండ దీర్ఘకాలము పుట్టినింటనుండు తరుణులు, ముదుసళ్ళు వివాహమాడినయువతులు, విపరీత నిష్ఠగల మిటారులు, పురుషులగోష్ఠి తిరగాడికాంతలు, జారపురుషుల భార్యలు వయస్సునుండు అపత్నీకులు, వివాహముకాని రజస్వలలు, సొగసులు మరగిన విధవలు, మూడు మనువుల మానినులు మొదలయిన వారియందు కామదాసులు, కామదాసికలు"[4] అని. వీళ్ళందరూ కామవాంఛ

3. నాస్తికత్వం - నాస్తితత్వం పుట. 17
4. చార్వాకుడు - వి. రామకృష్ణ

గల స్త్రీలుగానే కనబడుతున్నారు. ఇటువంటివారుగా పేర్కొన్న మత వాదులు వీరిమీద ఎంత దుష్ప్రచారం చేశారో, ఎంత అక్కసు వెళ్ళ బోశారో అర్థమవుతూనే వుంది.

వీరి నిర్దిష్టమైన తాత్త్వికఆలోచనా ధాటికి తట్టుకోలేక, ప్రతి తత్త్వగ్రంథంలోను ప్రతి మతగ్రంథంలోను వీరిని మతవాదులు విపరీతంగా దుయ్యబట్టారు.

భారతంలో చార్వాకుణ్ని రాక్షసునిగా చిత్రించి ధర్మరాజు సమక్షంలో చంపడాన్నిబట్టి భారత కాలంలో చార్వాకులమీద ఎంతటి వ్యతిరేకతఉన్నదో అవగతమవుతున్నది. తిక్కన అనువదించిన ఆంధ్ర మహాభారత శాంతి పర్వం ప్రథమాశ్వాసం 60 నుండి 70 పద్య ములలోనూ; సంస్కృత భారతం 38. 39 అధ్యాయములలోనూ ఈ ఉదంతము ఈ విధముగావున్నది.

ధర్మరాజు కురుక్షేత్ర రణరంగంనుంచి హస్తినాపురా నికి బయలుదేరి వస్తున్నాడు. అంతా కోలాహలంగా వుంది. బ్రాహ్మణాశీర్వాద ఘోషతో హస్తినాపురం ప్రతిధ్వనిస్తుంది. ఆ హోరుతగ్గిన తరువాత చార్వాకుడనే ఒక విప్లవవాది ధర్మరాజు ముందుకువచ్చి ధర్మరాజుచేసిన అధర్మయుద్ధాన్ని, తాతను, గురువును, అన్నను (కర్ణుడు), తమ్ములను రాజ్యంకోసం సంహరించిన దురా గతాన్ని, అట్టి అధర్మ ప్రభువును బ్రాహ్మణులు ఉత్తముడని పొగడ డాన్ని నిరసించి నిలదీసి అడిగాడు. బ్రాహ్మణులంతా ఆ విప్లవమూర్తి సత్య వాగ్ధాటికి తట్టుకోలేక అతడు రాక్షసుడని, దుర్యోధన మిత్రుడనీ, నీకు అపకారం చేయవచ్చాడని చెప్పి అక్కడికక్కడే చంపిస్తారు.

తరువాత కృష్ణుడువచ్చి ఈ చార్వాకుడు బ్రహ్మనుగూర్చి తపస్సుచేయగా, బ్రాహ్మణుల కపకారం చేయనంతకాలం ఎట్లాంటి

ప్రాణాపాయం లేకుండా వరమిచ్చాడని, ఇప్పుడు బ్రాహ్మణులను బ్రాహ్మణరక్షకుడైన రాజును దూషించి చచ్చాడని చెబుతాడు. బ్రాహ్మణుల నెదిరించిన, రాజుల నెదిరించిన లోకాయతులు, చార్వాకులు చంపబడ్డారు అనే సత్యాన్ని ఈ కథ చాటి చెబుతోంది.

భారతం జరిగిందా లేదా అనే ప్రశ్నకన్నా భారత రచనా కాలంలో చార్వాకంమీాద, ఎంత వ్యతిరేకతవుంది; ఆ ఉద్యమాన్ని నాశనం చేయడానికి ఆఉద్యమం అంటే జనంలో భయంకల్గడానికి ఎంత ప్రయత్నించారనేది ఇచ్చట బాగా పరిశీలించాల్సిన విషయం.

చార్వాకులంటే స్వచ్ఛమైన తాత్వికోద్యమ నిర్వాహకులు. సామాజిక దోపిడీకి ఎదురుతిరిగి గుండెలిచ్చినవారు. బానిస తిరుగుబాటుద్యమ నిర్వాహకులు. భారతదేశంలో నిజాయితీగా ప్రశ్నించడాన్ని, అన్యాయాన్ని ఎదిరించడాన్ని, సామాజిక దోపిడీని ఎదుర్కొనడాన్ని మొట్టమొదటగా నేర్పిన విజ్ఞానులు.

అందుకే భారతదేశంలో ఏ తాత్విక పునాదులమీాద దోపిడీ వ్యవస్థకు నిర్మాణం జరిగిందో, దాన్ని మొదటిగా ఎదిరించిన తాత్వికోద్యమాలేవో తెలుసుకోని ఆ మార్గంలో ఆ పునాదుల్ని కదిలించాల్సిందేకాని, నవీన సిద్ధాంతాలను ఒక్కసారిగా భారత దేశ దోపిడీని నిర్మూలించడానికి ప్రయోగించడం సాధ్యంకాదు.

అందుకే ఏ వ్యవస్థనైనా నిర్మూలించాలన్నా, అభివృద్ధి చేయాలన్నా దాని మూలాలలోకి పోవడం ఎంతైనా అవసరం. ఈ దేశంలో సామాజిక విప్లవం ఆవశ్యకతను గుర్తించనివారు ఎందరో ఉన్నారు. ఏ సాంస్కృతిక విప్లవాలద్వారా చార్వాకాన్ని చంపడానికి ప్రయత్నించారో – ఆ సాంస్కృతిక విప్లవంద్వారానే దానికి జీవం పోయాలి.

కృష్ణమిశ్రుడు ప్రబోధచంద్రోదయం నాటకంలో నాస్తిక వాదానికి చావుదెబ్బ కొట్టడానికి ప్రయత్నించాడు. క్రోధ, లోభ, మోహ, దంభములే నాస్తికత్వంగా వివేక, విద్యా విజ్ఞానాలే ఆస్తికత్వంగా తేల్చివేశాడు.

అజ్ఞాన అంధకారాలే చార్వాకమని, విజ్ఞానవికాసాలే ఆస్తిక్యమని తేల్చిచెప్పాడు. అయితే లోకాయతుల భౌతికవాదం ఈతని రచనలవలన మనకు కొంత తెలుస్తుంది. ప్రబోధ చంద్రోదయంలోని చార్వాకాన్ని పరిశీలిద్దాం —

చిదానంద నగరాన్ని ఈశ్వరుడనేరాజు పరిపాలిస్తూ ఉండేవాడు. అతనిభార్య మాయ. వారిరువురికి మనసు అను కుమారుడు పుట్టాడు.

ఆ రాజకుమారునికి —

"ప్రవృత్తి; నివృత్తి" అను ఇద్దరు భార్యలు. ప్రవృత్తివలన మహామోహుడు మొ॥ మున్నగు పుత్రులును-'నివృత్తి' వలన వివేకుడు మొదలగు పుత్రులును జన్మించారు. వీరిలో-తండ్రి పక్షపాతంచేత మహామోహునిపక్షం వారికి రాజ్యం ప్రాప్తించింది. మహామోహుడు వివేకాదులను అణచి రాజ్యపాలన చేస్తున్నాడు. అహంకారుడు, దంభుడు, లోభుడు, కామ, క్రోధాదులు ఇతనికి అండగాఉన్నారు.

వీరిలో దంభుణ్ని తన రాజ్యంలో ఒక భాగమైన కాశీనగరానికి పరిపాలనకు పంపగా; ఒకరోజు అహంకారుడు అతని దగ్గరకురాగా, దంభుడు అహంకారునికిమ్రొక్కి; నేను నీ మనుమడనని బంధుత్వం కలుపుకుంటాడు.

ఇట్లుండ మహామోహుడు ఒకరోజు కాశీపురం వస్తాడు. దంభుడు మొదలగువారు సంతోషంతో చుట్టుముట్టగా - ఆ మహా మోహరాజు చార్వాకాన్నిగూర్చి ఈ విధంగా చెబుతాడు —

''తనువునకు ఆత్మ వేఱట;
యనుభోగించునట! పిదప నాముష్మికమున్
వినుఁడీ దురాశ గగనా
వనిరుహపుష్పఫల భోగవాంఛన్ బోలెన్''

మ. కడు చోద్యంబిది పంచభూత పరిపాకప్రాప్త చైతన్యమీ
యొడలే యాత్మను సత్యవాదులట! యోహో నాస్తికుల్ దేహముం
బడఁగా నాత్మయు వేఱయుండునని దబ్బర్లాడు వారాస్తికుల్
పుడమింబూజ్యులు నైనవారలట! యీబొంకుల్వినంబోలునే.

క॥ కరచరణాద్యవయవములు
సరియట! మరి వేరె వేరె జాతులు గలవా
ధరలో నకృత్యమందురు
పరదార ధనాక్రమములు పౌరుషహీనుల్.

## చార్వాకమతము

వ. తమతమ యుక్తిబలంబులఁ బదార్థ భేదంబులు గల్పించి వావదూకులైనడ దుర్విదగ్ధులు సర్వజనంబుల మోసపుచ్చుచున్న వారింతియ కానిమాకునిది యెఱంబడేక కాదు. తోడిఁబఱం జెల్లుఁబడిగలవారలేమి చేసినంజెల్లియ పోవుఁగాక లోకంబులఁ గృత్యాకృత్యంబులు గలవనుట మిథ్య తథ్యంబు లోకాయతికంబె శాస్త్రంబు దండనీతియె విద్య ప్రత్యక్షంబె ప్రమాణంబు, పృథివ్యప్తేజో వాయురాకాశంబులే తత్వంబులు. భూతంబులే ప్రేరకంబులు. చచ్చుటయే మోక్షంబుగాక పరలోకంబన నెక్కడియది. ఇదియఁకదా వాచస్పతి చార్వా

కున కుపదేశించె నతండును శిష్య ప్రశిష్య పరంపర వలన జగంబునం దనమతంబు బహుళంబు చేయవలసె కురుక్షేత్రాది పుణ్యక్షేత్రంబులకుఁ జనినవాఁడు వాఁడును మనలమిచ్చుటకు వచ్చుటవిని యింతకుఁజనుదెంచు నని పలుకు నవసరంబునఁ జార్వాకుండును సర్వతీర్థంబులఁ జరియించి మహామోహు మహిమాక్రాంతంబైన కాశికానగరంబు ప్రవేశించి యందు నిజమత ప్రకారంబు విలోకించి సంతసించి శిష్యునితోడ వత్సా! ప్రత్యక్ష ప్రత్యక్ష ఫలమూలంబైన కృషి గోరక్షణాది సహిత దండనీతియ మంచివిద్య యని యెఱుంగక కొందఱు మూఢులు ముని భండ నిశాచర ప్రముఖ ధూర్త ప్రలాపితంబైన వేదత్రయంబు చదువుదు రందు వృథాప్రయాసంబె కాని భుక్తి లేదు. పరలోకంబు మొదలికే లేదు. వేదోక్త ధర్మంబు లబద్ధంబులగుట చెప్పెద వినుము.

కం॥ క్రతువును గర్తయు ద్రవ్య
ప్రతతియుఁ జెడఁ దమకుస్వర్గ ఫలము గలుగునే?
వితత దవానల దగ్ధ
క్షితిరుహముల వలన ఫలము చేరునకాదే.

గీ॥ చచ్చినట్టి జనుఁడు శ్రాద్ధంబుచేఁ దృప్తి
బొందుననుట వినగఁ బొందుగాదు
తీరనారినట్టిదివియమందునె ధూమి
నెంతచమురు పోసిరేనిఁ బిదప.

కం॥ నావుడు శిష్యుండిట్లను
దేవా! యిట్లయ్యేనేని తృణపర్ణఫలాం
భోవాయు భోజనాదుల
నీ వెట్టులు తీర్థవాసులేల కృశింపన్.

భారతంలో చార్వాకుణ్ని చంపినట్లు, భాగవతంలో వేనుణ్ని చంపినట్లు రామాయణంలో జాబాలిని నిరసించినట్టు ప్రబోధించారు. వేణీ సంహారం నాటకంలో ప్రత్యేకంగా చార్వాకుడు రాక్షసుడని ప్రచారం చేశారు.

ఎవరెంత ప్రచారం చేసిన శాస్త్రీయ విజ్ఞానపూర్వకమైన పునాదుల మీద నిర్మాణమైన ఈ సిద్ధాంతం మానవ మేధస్సుకు రాను రాను పదును పెడుతూనే వచ్చింది కాని ఇది నిర్మూలనం కాలేదు.

కర్మ, పునర్జన్మ, వర్ణధర్మం, అంతర్లీనంగా నడచిన భారతీయ తాత్విక చింతన, మనిషిలో మౌలికంగా ఉన్న స్వేచ్ఛను, మానవతా భావాలను చంపడానికి ప్రయత్నించింది. మనిషి మనుగడమీద పెత్తనం చెలాయించింది.

హిందూమతంలో ఏ దశలోను తాత్వికచింతన స్వేచ్ఛగా జరుగలేదు. అత్యంత ఉన్నతదశలో తార్కికంగా పయనించిన ఉపనిషత్తులు, దర్శనాలుకూడ, వేదాలగిరులుదాటడానికిజంకినవి. భౌతిక వాద తత్వానికి ఊపిరిగా వ్యవహరించిన, సాంఖ్య, వైశేషిక దర్శనాలు కూడ అతీతశక్తినో, పురుషుణ్నో వదలి బయటపడలేక పోయినవి.

ఇక పురాణాలవిషయం వేరుగా చెప్పాలా? ఆచార కర్మకాండల కులధర్మాల చట్రంలో మనిషిని అచ్చుపోశాయి. అయితే ఇంత భావ నియంతృత్వం పెత్తనం చేస్తున్నప్పటికి లోకాయత భౌతికవాదం మాత్రం చైతన్యవంతుల మేధస్సులో ప్రశ్న పరంపరలతో పెరుగుతూ విశ్వతత్వాన్ని వ్యాఖ్యానిస్తూ ఆధ్యాత్మికతత్వాన్ని సవాల్ చేసింది,

కాని లోకాయతం పుట్టినదగ్గరనుండి చనిపోయేవరకు హిందూ సంప్రదాయపుగిరిలో బ్రతుకుతున్న ఈ కృత్రిమమానవుడి దగ్గరకు మానవుడిచుట్టు ధ్వనిస్తున్న మత వాదపుహోరును చీల్చుకొని వాణ్ణి

ప్రభావితం చేయలేకపోయింది. కారణం ఈ ఉద్యమాన్ని అవహేళన చేస్తూ ఇది 'బూచి' అని మతవాదులు సామాన్యులను భయపెడుతూ రావడమే, ఎదురుతిరిగి తమభావాలు చెప్పుకునే స్వేచ్ఛను చంపడమే, దైవభావం లేకుండ ఆలోచించే సాహసాన్ని, సాహసించినవాణ్ణి చంపడమే, అంతేకాకుండ చంపినవాణ్ని గూర్చి* ప్రచారం చేసి, ఎదురుతిరిగే మన సత్త్వంమీద చావుదెబ్బ కొట్టడమే.

ఏది ఏమైన మతవాద క్రౌర్యానికి ఎన్నో శతాబ్దాలు చైతన్య వంతుల మేధలో నిక్షిప్తమైయున్న లోకాయత ఉద్యమం ఈ శాస్త్రీయ విజ్ఞానికయుగంలో మరల ప్రజ్వలించింది. అది హిందూమత సామాజిక చట్రాన్ని వ్రయ్యలుచేసి కులవ్యవస్థా పునాదులను మూలంటా త్రవ్విపారవేసి మానవ సామ్రాజ్యాన్ని నిర్మించడానికి ముందుకు పోవాలి.

ఎందుకంటే ఈ దేశంలో సామాజిక విప్లవావశ్యకతను, అవసరాన్ని గుర్తించిన ఉద్యమాలలో ఇది ఉన్నతమైంది. మనిషిని మనిషిగా తీర్చిదిద్ది పోరాటానికి సన్నద్ధం చేయగలిగిన మహోద్యమం ఇది.

---

* చార్వాకుడు, మొదలగువారిని

# జైనం – మతవిప్లవం

హిందూమతుల వ్యవస్థకు భిన్నమైన సిద్ధాంతాన్ని ప్రబోధించిన విప్లవమతాల్లో జైనం ఒకటి. హింసకు పునాది అయిన హిందూమత కర్మకాండను జైనం తీవ్ర అహింసావాదంతో వ్యతిరేకించింది. హిందూమతంచేత నిరాదరింపబడిన వైశ్యులు దీన్ని పోషించారు. హిందూవైదికధర్మాన్ని అండగా బెట్టుకొని రాజులే తమ పాద దాసులుగా చేసుకొన్న బ్రాహ్మణ గురుపీఠాన్ని ఎదిరించడానికి రాజులు కూడ ఈ మతాన్ని స్వీకరించారు. (మగధను పాలించిన హార్యంక, నందవంశ చక్రవర్తులు జైనమతాన్ని ఆదరించారు.)

ఇంతటి ఉత్కృష్టమైన మతాన్ని ప్రవచించిన జైనమత ప్రవక్త మహావీరుడు. ఇతడు క్షత్రియుడు ఈతడు బుద్ధునికంటె పెద్దవాడు మరియు సమకాలికుడు. జైన సంప్రదాయం ప్రకారం మహావీరుడు తీర్థంకరుల్లో 23వ వాడు. ఈతడు క్రీ॥ పూ॥ 540 సం॥లో వైశాలికి దగ్గఱలో ఉన్న 'కుండగ్రామ' అనే గ్రామంలో జన్మించాడు. పార్శ్వనాథుడు మహావీరుని కంటె 250 సం॥కు ముందు వాడని, పార్శ్వనాథునకు ముందు 'అరిష్టనేమి' ఉండేవాడని; అతడు మహావీరునికంటె 84,000 సం॥కు ముందు మరణించాడని, అతనికి 50,000 సం॥కు ముందు 'నేమి' ఉండేవాడని జైన పౌరాణిక సాంప్రదాయం భావిస్తుంది. ఈ లెక్కలు చారిత్రకంగా నిలబడవు. కాని మహావీరునికి ముందే జైనమత భావాలు ఉన్నాయనిమాత్రం అర్థమవుతుంది.

మహావీరుని అసలుపేరు వర్ధమానుడు. ఈతడు ఉత్తమ బోధకుడు. దేవుని ఉనికిని అంగీకరించినవాడు కాడు. మంత్రాలను యజ్ఞయాగాదులను ఖండించాడు. వాస్తవజ్ఞానం, వాస్తవ విశ్వాసం, వాస్తవ ఆచరణ ఈతని సూత్రాలు. సత్యాన్ని తెలిసికోవటం కోసం శరీరాన్ని బాధించమంటాడు. మరణమే మోక్ష

మంటాడు. అహింసను బోధించాడు. ఆత్మహత్యను అంగీకరించాడు. వివాహాన్ని నిషేధించాడు. సన్యాసి జీవితం గడపమన్నాడు. మనుష్యుల్లోను, మృగాల్లోనేగాక చెట్లలోను, అగ్నిలోను, గాలిలో కూడా ఆత్మ ఉందన్నాడు. మృగాలు మనుష్యులవలెనే బాధల్ని అనుభవిస్తాయని చెప్పాడు. మృగాలకు, పశువులకు, చెట్లకు కూడా బాధ కలిగించ వద్దన్నాడు. సమ్యక్ చరిత్ర, సమ్యక్ జ్ఞానము, సమ్యక్ దృష్టి అనేవి జీవుల సహజస్వభావాలు. కాని ఇవి కర్మప్రభావం వలన మరుగున పడిపోతాయని జైనులు భావించారు.

ఈ సూత్రాలు హిందూ కర్మకాండకు గొడ్డలిపెట్టుగా ఉన్నాయి. మానవులందరికి ఒకే సూత్రాలు ప్రవచించడంతో చాతుర్వర్ణ్య ధర్మాలకు అగ్నిపెట్టినట్లయ్యింది. నరమేధం, అశ్వమేధం; వాజపేయం మొదలగు పేర్లతో మనుష్యుల్ని, జంతువుల్ని క్రూరంగా దగ్ధమొనర్చే హిందూమత హింసావాదాన్ని ఈ సూత్రాలు ఎదుర్కొన్నాయి. కర్మకాండల పేరుతో నవధాన్యాలను దగ్ధమొనర్చే విధానాన్ని వ్యతిరేకించాయి.

అయితే ఈ మతం రానురాను తన పునాదుల్ని కాపాడుకోలేక పోయింది. హిందూమత కర్మభావం, కులభావం ఇందులోను చోటు చేసుకున్నాయి. జైనం తన ఉనికిని భారతదేశంలో ఈనాటికీ నిలుపుకోగలిగింది కాని; దాని తత్వాన్ని మాత్రం కోల్పోయి నిర్జీవమైన మతంగా మిగిలిపోయింది.

# బౌద్ధం – సామాజిక విప్లవం

బ్రాహ్మణ సంస్కృతిని ప్రతిఘటించి తనదైన ఒక నవీన సంస్కృతిని నిర్మించుకొనడానికి యీ దేశములో కృషిచేసిన మహోన్నత ఉద్యమం బౌద్ధుల ఉద్యమం.

ఆదిలో అవలంబింపబడిన వైదికమతము రానురాను బ్రాహ్మణీయతకు దారితీసింది. అది మరలా హిందూ మతములోకి వచ్చింది. బౌద్ధమతము బ్రాహ్మణీయతకాలములో అవతరించినది. ఎందువలననగా మొట్టమొదటిసారిగా భారతదేశంలోకి అసమానత్వాన్ని ఆధిపత్యాన్ని వివిధ వర్గాల క్రింద సామాజిక విభజనను, బ్రాహ్మణీయత తీసుకొచ్చింది. దానిని బౌద్ధమతము వ్యతిరేకించింది. అందుకే డాక్టరు అంబేడ్కర్ 'బౌద్ధ' మతాభ్యుదయము 'ఫ్రెంచి విప్లవమంత భావ గర్భితమైందని' అంటారు.

అసలు ప్రపంచచరిత్రలో క్రీ.పూ 6 వ శతాబ్దానికి విశిష్టత ఉన్నది. నాటి ప్రముఖ నాగరికతా కేంద్రాలన్నింటిలోను సాంఘిక ఆధ్యాత్మికతా సంచలనం కలిగింది. పాతవిలువల విశ్వాసాల, ఆచారాలపైన, వ్యవస్థలపైన. అసంతృప్తి తీవ్రమైంది. వ్యక్తి, సమాజము వ్యక్తి రాజ్యము రాజ్యవ్యక్తుల పరస్పర బాధ్యతలు, ఐహికనీతి, ఆముష్మికానందము మొదలగు అంశాలపై ఆలోచన వాదోపవాదాలు సాగి, పురోగమనశీలమైన కొత్తవిలువల కోసం అన్వేషణ జరిగింది. గ్రీసులో "సోక్రటీస్" పర్షియాలో "జొరాస్టర్" చైనాలో "కంఫ్యూషియస్" మొదలగు దార్శనికులు ఆకాలములో వెలసినవారే.

క్రీ. పూ 563 లో, భారతదేశంలో కపిలవస్తు నగరమున శాక్య వంశములో, శుద్ధోదన మాయాదేవులకు లుంబినీవనములో, బుద్ధుడు

జన్మించి, విమర్శనాత్మకముగా శాస్త్రములను, జీవకారుణ్య దృష్టితో ప్రపంచాన్ని గూర్చి ఆలోచించి ఈ ప్రపంచంలో దుఃఖానికి కారణమును, దాని పరిష్కారమును అన్వేషించుటకు తన ఆలు బిడ్డలను, రాజ్యాన్ని త్యజించి సన్యసించి తత్వాన్వేషణగావించి శాస్త్ర పరిశోధన చేసి, ప్రపంచంలో దుఃఖానికి కారణము, కోరికలని అభిప్రాయపడి ప్రపంచంలోని ఈ అస్తవ్యస్తతకు ఏ అతీతశక్తి కారణముకాదని, గ్రహించి, భగవంతుడు, ఆత్మ, ప్రకృతికి అతీతమైన మరియేయితర శక్తి లేదని, అవి ప్రపంచ దుఃఖానికి కారణము కాదని, ప్రజల దుఃఖానికి సామాజిక వ్యవస్థలోనున్న వర్ణవ్యవస్థయే, ముఖ్యకారణమని తెలుసుకొన్నాడు. "అంతియేగాక ఉపనిషత్తుల తాత్వికాలోచనా పరంపరలను పరిశోధనలను, సమన్వయపుచి సమకాలిక సమస్యలకు పరిష్కారముగా ఉపకరించే ధర్మాన్ని, ఆధర్మానికి పునాదిగా దర్శనాన్ని యితడు రూపొందించాడు. అందుకే రాధాకృష్ణపండితుడు "The Budda is a man not 'God' A teacher and not a Saveior" అని అంటారు.

ఈ బోధకుడు బ్రాహ్మణవ్యవస్థ నూరిపోసిన వర్ణవ్యవస్థను తీవ్రంగా వ్యతిరేకించాడు. వైదిక కర్మకాండలను నిరసించాడు. పూజారి తత్వాన్ని, బ్రాహ్మణాధిక్యతను నిరసించి, మానవతను పెంచి పోషించాడు. మానవులందరు ఒక్కటేననే భావాన్ని ఈ దేశంలో ఎలుగెత్తి చాటాడు. అతనిలోని త్యాగశీలత, జీవకారుణ్యము, లోకకళ్యాణదీక్ష, అసాధారణ జ్ఞానము, బోధనాశక్తి, వర్ణసంస్కృతి నుంచి మనుష్యులను మానవసంస్కృతిలోకి నడిపించడానికి ఉపకరించినవి. ఒక ప్రత్యేకమైన జీవనవిధానంతో దోపిడీని, దారిద్ర్యాన్ని పెంచి పోషించిన, హిందూసంస్కృతిని పారద్రోలటానికి ప్రయత్నించాడు.

రాజు సేవక భేదాన్ని ఛేదించి పురోహితదాష్ట్యంతో సామాజి కార్థిక దోపిడితో దుఃఖపాత్రుడగుచున్న మనిషికి బుద్ధతత్వం

పోరాటాన్ని నేర్పింది. ఆ పోరాటం ప్రశాంతమైంది. కాని అందులో అగ్నిశిఖలున్నాయి. మహోగ్రమైన విషనాగులకు నిలయమైన బ్రాహ్మణ సంస్కృతిని ఎదుర్కొనటానికి సాహసించడం సామాన్యమైన విషయం కాదు. ఇది మహోన్నతమైన విప్లవం. గుండెపొరలలో పేరుకపోయిన దోపిడీ మనస్తత్వాన్ని, శానిస మనస్తత్వాన్ని కడిగివేసి మానవులందర్నీ సంఘటిత పరచటానికి చేసిన మానవతా యజ్ఞం.

వేసికొన్నవి కాషాయవస్త్రాలు కావచ్చు, కానీ అవి ఉక్కు కవచాలు, పట్టుకున్నది భిక్షాపాత్ర కావచ్చు అది పాతసంస్కృతికి ప్రతిబింబమైన పురోహిత యాచనావిధానాన్ని ధ్వంసముచేసి, నవీన జీవన విధానాన్ని పంచిపెట్టాలనుకున్న అక్షయపాత్ర. భిక్షు సమూహాల సౌమ్యంలో గంభీరత, రాజసం, పూర్వభావాల కుళ్ళును కెళ్ళగించాలనే మహోన్నతోద్యమ సంస్కారం ఉంది. సమ్యక్ వాక్కు, సమ్యక్ క్రియ, సమ్యక్ జీవనం, సమ్యక్ శ్రమ, సమ్యక్ ఆలోచన, సమ్యక్ ధ్యానం, సమ్యక్ నిశ్చయం, సమ్యక్ దృష్టి అనే బుద్ధుని ధర్మచక్ర ప్రవర్తన సూత్రంలో నిర్దేశించిన అష్టాంగమార్గం, నిశిత అస్త్రశస్త్ర సమూహాలై వర్ణవ్యవస్థా విషవృక్షాలను భేదించి, ఛేదించి, నవీన మానవతారామములను నిర్మించడానికి ఉద్యమించినయ్.

అందుకే ఆ ఉద్యమం ప్రజాఉద్యమం, ప్రజలను కదిలించిన ఉద్యమము, అరాచకాన్ని దుయ్యబట్టి, అగ్రవర్ణాల దురహంకారాన్ని ఎదిరించి, మానవ విలువలను పెంచి, మానవతా సుగంధాన్ని పంచే ప్రజాచైతన్యాన్ని ప్రజ్వలింపచేసిన ప్రజాఉద్యమం.

ముఖ్యంగా కర్మకాండకు, విద్యకు, దానానికి, గౌరవానికి, అగ్రవర్ణాలే అర్హులు మిగిలినవారు అర్హులుకాదు అనే దుష్టనీతిని ఎదిరించిన ఉద్యమం.

వ్యవసాయానికి, వృత్తులకున్న ప్రాధాన్యతను చాటిచెప్పే యే వృత్తిచేసినా మానవులందరూ ఒకటేనని ప్రకటించిన ఉద్యమం.

తత్వానికి దూరంగా బ్రతుకుతున్న ప్రజలందరికీ పండితపామర రాజు, పేద భేదంలేక ధర్మాన్ని చాటిచెప్పిన ఉద్యమం.

హింసాపూరితమైన, అగ్నిష్టోమం. అశ్వమేధం,[1] రాజసూయం, నరమేధం, వాజపేయం,[2] సౌత్రామణి యజ్ఞం, మహావ్రతం, పౌండరీకం,[3] సర్వమేధం, సర్వసారం — అనేయాగాలతో —

మనుష్యులను, మేకలను, గుఱ్ఱాలనువధించడం—ధనధాన్యాలను నాశనం చేయడం – కొవ్వును, రక్తాన్ని, నేతితో వేయించి త్రేంచేవరకు తిని తమ ఆధిక్యతను, అహంకారాన్ని, ప్రకటించుకోనడం, తద్వారా స్వర్గానికి పోవడం, అందు రంభా సంభోగం. ఈ బాపతు దుర్మార్గకాండను మొత్తం నిరసించి అహింసా బావుటాను ఎగురవేసిన ఉద్యమం.

హింసతో, రక్త తర్పణతో రాబందుల మార్గాన్ని అనుసరిస్తున్న ద్విజుల కర్మకాండలకు, శూద్రులు అర్హులుకారని, వారిశ్రమశక్తితో బ్రతుకుచున్న పురోహితవర్గం, వారిని నిరసించింది. వర్ణవ్యవస్థకు పునాదులు ఈ కర్మకాండలోనే ఉన్నాయి. బ్రహ్మ, సృష్టిలోనే మనుష్యులను వివిధ వర్ణాలుగా వివిధ ధర్మాలతో సృష్టించాడని శూద్రులు బానిసలుగా బ్రతకడాన్ని బ్రహ్మ వారి నుదుటన వ్రాశాడని పూర్వజన్మ సుకృత ఫలితంగా ఈ జన్మలో బ్రాహ్మణులు బ్రహ్మజ్ఞానులుగా పుట్టారని ఈ విధమైన కర్మభావాన్ని వర్ణవ్యవస్థమీద రుద్ది వర్ణవ్యవస్థకు ఉక్కుపునాదులు నిర్మించారు.

ఒకవ్యక్తిని మరొకవ్యక్తి బాధించే మనస్తత్వాన్ని ఒక వర్ణాన్ని మరొకవర్ణము దోచుకొనే న్యాయాన్ని చట్టబద్ధంచేశారు.

ఆ ఉక్కుపునాదుల్ని ఛేదించడానికే బుద్ధుడు వ్యయ ప్రయాసాలతో నిండిన యజ్ఞమతంనుంచి ప్రజల దృష్టిని వైయక్తికమైన ఆత్మ సంస్కారము వైపుకు మరలించాడు. మతానికి లక్ష్యము, లౌకిక, పారలౌకిక సుఖాలుకాదని, వ్యక్తినీతి, సామాజికనీతి లక్ష్యము కావాలని బోధించాడు. యీ బౌద్ధతత్వాన్ని ప్రజా హృదయాలలో వెదజల్లటానికి, బౌద్ధంలో అనేకమంది దార్శనికులు కృషిచేశారు. వారిలో అశ్వఘోషుడు, నాగార్జునుడు, వసుబంధు, అసంగుడు, భావవివేకుడు, దిఙ్నాగుడు, చంద్రకీర్తివంటి దిగ్గంతు లున్నారు. దీనివలన ప్రపంచంలో తాత్వికాలోచన ప్రతిష్టంబనకు గురియైన తరుణంలో తాత్వికఆలోచన పటిష్టంగాసాగింది ఒక్క బౌద్ధంలో మాత్రమే నని మనకు తెలుస్తున్నది.

చారిత్రక పరిణామంలో బౌద్ధం యీ నవీన మానవసంస్కృతిని ప్రచారము చేయుటానికి, అనల్పమైన శిల్పకళని, చిత్రలేఖనాన్ని జాతీయ కళాసంపదగా ప్రోగుచేసింది. వేదాలు, దర్శనాలు, ఉపనిషత్తులు, బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు, పురాణాల ద్వారా, హిందూమతం ప్రచారమైతే దాన్నెదిరించి నిలువటానికి బౌద్ధులు శిల్ప సంపదను వాడుకొన్నారు. మహారాష్ట్రలో కార్లి, నాసిక్, భజా మొదలైనచోట్ల అజంతాలోను బార్హుత్, సాంచి, నాగార్జునకొండలలో కర్ణాటక, గోవ, అమరావతి, నాగపట్నం, కాంచీలలో బౌద్ధులు అత్యద్భుతమైన శిల్ప ప్రపంచాన్ని సృష్టించి, భారతీయ మన స్తత్వంలో మహోన్నతస్థానాన్ని ఆక్రమించారు. వారణాశి. వైశాలి, శ్రావస్తి, కపిలవస్తు మొదలగునవి బౌద్ధసంస్కృతికి స్థావరాలైనవి. ఆ కాలంలో హిందూమతం కూడ నిద్రపోతూనే వుంది.

అంతేగాక అగ్రవర్ణాలు గుత్తకు తీసుకొన్న విద్యను, గురుకుల వ్యవస్థను ఎదిరించి విశ్వవిద్యాలయాలు స్థాపించారు. వర్ణదురహంకారాన్ని వర్గదోపిడిని ప్రశాంత గంభీరంగా ఎదిరించి నిలిచారు.

ఈ దేశంలో హిందూతత్వాన్ని మార్చాలని ప్రయత్నించిన ప్రతీసిద్ధాంతంలో కులం జోరబడింది. కాని బౌద్ధమతం అట్లుగాక వర్ణ వ్యవస్థకు సంబంధించిన మాలిన్యాన్ని తనకంటకుండ చూచుకొన్నది.

అందుకే శంకరాచార్యుల దుష్టతత్వంతో మరలా తలెత్తిన హిందూకాలనాగు బౌద్ధాన్ని ఈ దేశం నుండి తరమడానికి తన శక్తి యుక్తులన్నీ ఉపయోగించింది.

నాటి బౌద్ధారామాలన్ని నేడు పాటిదిబ్బలుగా లంజెదిబ్బలుగా మిగిలిపోయినవి.

అందుకే-

కరకు కత్తుల కెరమైన
కుత్తుకల నెత్తుటి చారలు
మాయలేదు.
బౌద్ధ స్థూపాల తలలు తెగద్రెంచి
శివలింగాలుగా రంగరించిన
కుటిల హస్తాల కర్కశకుటిల నీతియు
చెరగలేదు.
చరిత్ర గర్భానకొన ఊపిరితో
గిలగిలలాడుతున్న
సత్యగళాల నిగళాలు విప్పిచూస్తే
నేటి ఆంధ్రుల మత సంస్కృతికి
రుధిర దివ్వెలు పట్టిన పంచారామాలు.

నాటి బౌద్ధక్షేత్రాల సజీవసమాధులు
బౌద్ధధర్మాల సుమాలు గుబాళించిన
ఆరామ సీమలు

ప్రజాసంస్కృతిని ప్రదీపించు
శిథిల శిల్ప బౌద్ధ కళావేదికలు
అన్నట్టి సత్యవాగ్ఝరీ పరీవాహము
నిప్పులు చెరుగుకుంటూ పారదే *

నిజంగా హిందూమతాన్ని బౌద్ధమతం కాలరాయడానికి తనశక్తిని ఎంత ప్రదర్శించిందో చరిత్ర చాటి చెబుతూనే వుంది.

"అమరావతిలో బౌద్ధస్తూపంపైనే అమరేశ్వరాలయ నిర్మాణం జరిగింది" (శ్రీ. శ్రీ॥ ఎం. సోమశేఖరశర్మ పురావస్తుశాఖా మాజీ డైరక్టరు శ్రీ రమేష్ ప్రభృతులు విశ్వసించారు) "క్రీస్తుపూర్వం 300 సంవత్సరములనుంచి క్రీ. శకం 700 సంవత్సరముల మధ్యగల వెయ్యి సంవత్సరముల కాలములో బౌద్ధమతం వెల్లివిరిసింది. ఆనాటి బౌద్ధుల చారిత్రక అవశేషాలు ఈనాటి త్రవ్వకాలలో బయల్పడ గలవు' (బి. యస్. ఎల్. హనుమంతరావుగారు కె. వి. రత్నంగారు అమరావతినిగూర్చి చేసిన ఇంటర్వ్యూలో తెలిపారు ఆంధ్రజ్యోతి 8-10-80)

క్రీస్తు శకం 7. 8 శతాబ్దాలలో కాలముఖులనే శైవులు విజృంభించి సింహపరిషత్తును స్థాపించి బౌద్ధమతాన్ని, బౌద్ధశిల్పాన్ని, బౌద్ధ కళా సంపదల్ని, బౌద్ధ సాహిత్యాన్ని, బౌద్ధఆరామ సీమల్ని ధ్వంసం చేశారని చారిత్రక పరిశోధకులు భావిస్తున్నారు.

ఏదిఏమైన హిందూమత దౌర్జన్యానికి దురహంకారానికి బౌద్ధం బలవంతంగా నాశనం చేయబడినట్లు మనకు తెలుస్తున్నది. భారత దేశంలో మత అసహనాలకు ఇవి చిహ్నాలు కాగా, మత సహనానికి పెట్టింది పేరుగా హిందూ మతాన్నిగూర్చి చాటిస్తున్నారు.

ఏమైనా హిందూమత సహనానికి చిహ్నం భారతదేశంలో ఈ నాడు బౌద్ధం లేకపోవడమే.

---

* గర్భగుడి (గేయం) రాబోయే నా గేయ సంకలనమునుంచి.

1. అశ్వమేధం

"యజమాన ప్రమదా వికస్వర భగ
న్యస్తాశ్వ దీర్ఘస్మర
ధ్వజదండంబగు నశ్వమేధ మఖతం
త్రంబున్ నిరీక్షించుచున్.... ...." శ్రీనాథ మహాకవి.

యజమాన = అశ్వమేధ యజ్ఞం చేస్తూ ఉన్న అతని యొక్క.
ప్రమదా = భార్యయొక్క, వికస్వర = విప్పారి ఉన్న; భగ = స్త్రీ అవయవం (యోని)యందు, న్యస్త_ఉంచబడిన, అశ్వ = గుర్రం యొక్క.
దీర్ఘ = పొడుగైన_
స్మరధ్వజదండంబు = మన్మథుని జండాకొయ్య (పురుష అవయవము)ను కలది అగు, అశ్వమేధమనే పేరుగల, మఖ _ యజ్ఞమునందలి తంత్రంబున్ _ కార్యక్రమాన్ని, నిరీక్షించుచున్ = చూచుచు ,.....

అనగా - అశ్వమేధయాగం చేయువాని భార్య, అశ్వం (గుఱ్ఱం) లింగాన్ని తన యోనిలో పెట్టుకోవడం.

ఈ యజ్ఞాన్ని శ్రీరాముడు, జనమేజయుడు. ధర్మరాజు ఎంతో నిష్ఠతో చేశారు.

(దేవాలయాలమీద బూతుబొమ్మలు _ తాపీ ధర్మారావు, పేజీ 88)

2. వాజపేయం

వాజపేయమనగా అశ్వమును చంపి చేయుయజ్ఞము

"ఆర్వాసి సప్తిరసివాజ్యసి"

అర్వా, సప్తి, వాజి, ఈమూడు ఈయాగానికి ఉపకరించు గుఱ్ఱములు, శ్రుతి ఈ గుఱ్ఱములగూర్చి ఈ విధముగా చెప్పుచున్నది.

"అర్వాసి సప్తరసి వాజ్యసీత్యాహ। అగ్నిర్వాఅర్వా। వాయుస్సప్తిః। ఆదిత్యోవాజీ ఏతాభిరేవా స్మైదేవతా భిర్దేవ రథంయునక్తి।" అనగా అర్వాఅను గుఱ్ఱము అగ్నిదేవత, సప్తిఅను గుఱ్ఱము వాయుదేవత, వాజీఅను గుఱ్ఱము సూర్యదేవత ఈమూడు గుఱ్ఱములచేత రథమును కట్టవలెను.

తరువాత

"వాజనో వాజంధావతమరుతాం ప్రసవే జయతవియో
జనామి మీధ్వమధ్వనస్క-భ్నిత కాష్ఠాంగచ్ఛత"

ఓ గుఱ్ఱములారా? అన్నమును సంపాదించుట కొరకు తొందరగా పరు గెత్తండి. ఆజిస్థానమునకు త్వరగా చేరండి.

"వాజినోవాజం ధావత కాష్ఠాంగచ్ఛతేత్యాహ।
సువర్గోవైలోకః కాష్ఠా।"

అనగా అగుఱ్ఱములు చేరుకొనేసరిహద్దు ఆజిస్థానము. దానిని కాష్ఠ అందురు. అనగా పైమూడు రకముల గుఱ్ఱములను కాష్ఠమునచేర్చి (చంపి) యజ మానుడు స్వర్గమునకు పోవుటయే వాజపేయమందురు.

[వాజపేయం అనేఅముద్రిత గ్రంథంనుండి ఇది గ్రహించబడినది.]
మొత్తంమీద అర్వ, సప్తి, వాజి అనుపేరుగల గుఱ్ఱములనుచంపి యాగం చేయడమే వాజపేయం.

## 3. పౌండరీకం

పౌండరీకం అంటే బహిరంగ సంభోగం. మానవుడు జంతుదశనుదాటి విజ్ఞానవంతుడైనా మతం, కర్మ జంతువుకంటె హీనమైనదశల్లోకి మానవుణ్ణి త్రోసివేశాయి అనడానికి ఇదిగుర్తు. ఒక పందిరిమీద పౌండరీక యజ్ఞము చేయు భార్యాభర్తలు వేదమంత్రాల ఘోషలమధ్యలో అందరూచూస్తూ వుండగా బహిరంగ సంభోగం చేయడమనేది ఎంత నీచమైన కృత్యమో ఆలోచించండి. మనిషి బొందితో స్వర్గానికి వెళ్ళడానికట ఈ కార్యాన్ని చేయించడం. ఇంతకంటే అనాగరికం ఏముంది, కర్మలపేరుతో ఎన్నోనీచ కార్యాలుచేసిన ఈ మతం, ఈ కార్యాలు అనువర్తించువారు, అనువర్తింప చేయువారు ఉత్తమకులముల వారిగా ప్రచారంచేసింది.ఇదిఎంత హైన్యమైన మతమో ఈ కర్మలు ఆచరించినవారు మానవపరిణామంలో ఏదశకు సంబంధించినవారో. — ఆలోచించండి.

# మౌర్యులు - వర్ణవ్యవస్థ

భారతీయ రాచరికపు వ్యవస్థకు ఉక్కుకవచాలు తొడిగిన కౌటిల్యుడు అర్థశాస్త్రాన్ని ప్రసాదించిన కాలం, ప్రజాధర్మాన్ని ప్రజాక్షేమాన్ని, ప్రజాపాలనకు ఊపిరిగా పెట్టుకున్న కాలం, అది భారతీయ రాజకీయ వ్యవస్థలో ఏక సూత్రత ఘటించి అఖిల భారత సామ్రాజ్యానికి పునాదులు వేసిన కాలం, చక్రవర్తులు కరుణార్ద్ర హృదయులై శాంతిపతాకాలను ఎగుర వేసిన కాలం, ప్రజల గుండె సొదలను ప్రభువులు గద్దెదిగి విన్నకాలం అని చరిత్రకారులు వేనోళ్ళ పొగడినకాలం మౌర్యులకాలం.

మౌర్య సాంమ్రాజ్య స్థాపన మనదేశ చరిత్రలో ఒకగొప్ప చారిత్రాత్మక సంఘటన. మౌర్యుల కాలమునుండే మనకు చారిత్రక ఆధారాలు దొరుకుతున్నాయి. కనుకనే స్మిత్ పండితుడు "మౌర్యులు రాకతో చరిత్రకారుడు గాఢాంధకారమునుండి వెలుగులోకి వచ్చినట్లయ్యింది, కాలనిర్ణయము అకస్మాత్తుగా నిర్దిష్టమయ్యింది"అని అన్నాడు.

(The advent of the Mauryan dynasty marks the passage from darkness to light for the historian — Chronology suddenly becomes definite almost precise ' — Smith)

ఈ కాలములోనే కౌటిల్యుని అర్థశాస్త్రం సంస్కృతభాషలో వ్రాయబడింది, దీనిలో ఆరువేల శ్లోకాలు, పదునైదు భాగాలు, నూటఏభై తొమ్మిది అధ్యాయాలున్నాయి. ఇది చంద్రగుప్తమౌర్యుని పరిపాలనా విధానము, ఆనాటి రాజకీయ సాంఘిక విషయాలకు దర్పణంగా ఉన్నది. ఈ కాలములోనే విశాఖదత్తుడు ముద్రారాక్షసమను నాటకంలో ఆనాటి సాంఘిక, ఆర్థిక, మత, పరిస్థితులకు దర్పణం పట్టాడు.

జైనుల మతవిప్లవం, బౌద్ధుల సామాజిక విప్లవం విజయ పతాకాలెత్తిన కాలమది. ఆ కాలములోనే వైదిక మతముకూడా భక్తితత్వాన్ని జీర్ణించుకొని శైవ వైష్ణవమతాలుగా ప్రచారమయింది. అయితే జైన బౌద్ధమతాల ప్రభావం దానిమీద విశేషంగాబడి దాని స్వరూపాన్ని ప్రజల కనుకూలముగా మార్చుకొన్న కాలమది. అయితే ఒకప్రక్క బౌద్ధమత సామాజికవిప్లవము కులంకుళ్ళును కెళ్ళగించాలని ప్రయత్నిస్తున్నా, హిందూమతానికి ఊపిరైన కులవ్యవస్థ పునాదులు మాత్రం కౌటిల్యుని అర్థశాస్త్రం సహాయముతో గట్టిపడుతూనే వచ్చాయి.

కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో బ్రాహ్మణమత విషవృక్షానికి నీరుపోసి పెంచి పెద్దచేశాడు. వైదిక ధర్మరక్షణ, జైన బౌద్ధమతాల విధ్వంసన, బ్రాహ్మణ క్షత్రియ వర్ణాధిపత్య స్థాపన తన ప్రధానాశయాలుగా పెట్టుకున్నాడు. మహాపరాధం గావించిన పురోహితునికి, ప్రధానమంత్రికి మరణదండన లేదని శాసించాడు. వర్ణాశ్రమధర్మాలను ప్రవచించి ప్రధానమైన నాలుగువర్ణాలకు వేరు వేరు ధర్మాలను నిర్దేశించి వర్ణ సంకరము కాకుండ కాపాడమని, రాజుని, పురోహితవర్గాన్ని ఆదేశించాడు. వేదవిద్యను అభ్యసించడం, వేదవిద్య చెప్పడం, యాగము చేయడం, యాగాన్ని చేయించడం, దానాన్ని తీసుకోవడం, దానాన్ని ఇవ్వడం బ్రాహ్మణధర్మాలుగా చెప్పాడు.

క్షత్రియ ధర్మముగా వేదవిద్యను అభ్యసించుట, యజన, యాజన ప్రతిగ్రహాలను చెప్పాడు.

వేదాధ్యయన, యజన, దాన, కృషి, పశుపాలన వాణిజ్యాలు, వైశ్యధర్మాలుగా చెప్పాడు. బ్రాహ్మణ క్షత్రియ అగ్రవర్ణాల శుశ్రూషయే శూద్రధర్మాలుగా చెప్పాడు. ఈ ధర్మానుసరణమే స్వర్గానికి మార్గమని నిర్దేశించాడు.

బ్రాహ్మణ క్షత్రియ వర్ణాలకు లోబడి శుశ్రూష చేయుటయే వైశ్య శూద్ర వర్ణాలకు ధర్మంగా చెప్పి లౌకిక అలౌకిక అధికారాలను పైవారికి ప్రాప్తింపజేసే శూద్రుల జీవితాలను బానిస వ్యవస్థలోకి ఈడ్చాడు. ప్రభుత్వానికి కొమ్ముగాసి పాలితులనోట్లో దుమ్ము కొట్టాడు. స్వర్గనరకాల భయం కల్పించి బ్రాహ్మణవ్యవస్థకు స్వర్గాన్ని, శూద్రవ్యవస్థకు నరకాన్ని ఈ లోకములోనే నిర్మించాడు. వర్ణ దురహంకారాన్ని, వర్ణబానిసత్వాన్ని సమర్థించాడు. "రాజు వర్ణ సాంకర్యాన్ని ప్రోత్సహించి, ధర్మశాస్త్రాల్ని తిరస్కరించితే సూర్య వంశ చక్రవర్తియైన అసమంజసుణ్ణీ, వేనుణ్ణీ బ్రాహ్మణులు కుట్రచేసి ఎలా హతమార్చారో అలాగే సర్వనాశనం చేస్తారని హెచ్చరించాడు. అందుకు ఈ క్రింది ఉదాహరణ మిచ్చాడు. భోజవంశస్థుడైన దాండక్యుడు బ్రాహ్మణకన్యను కోరి వివాహం చేసుకోవాలని యత్నించడం బ్రాహ్మణుల దృష్టిలో కామాంధతగా పరిగణింపబడి, అతన్ని నరికివేశారు. విదేహరాజైన కరాళుడు బ్రాహ్మణుల కృత్యాలకి ఆగ్రహించి వారిపై విక్రమించిన జనమేజయుడూ, భృగువులపై విజృంభించిన తాళజంఘుడూ, బ్రాహ్మణుల వద్దనుండి పన్ను వసూలు చేయ యత్నించిన ఐళుడూ, అజబిందుడూ, దంబోద్భవుడూ, హైహాయ అర్జునుడు, వాతాపి మొదలగు రాజులు - బ్రాహ్మణాధిక్యతను వ్యతిరేకించారు కాబట్టి, దుంపనాశనం గావింపబడ్డారు. అందుచేత బ్రాహ్మణాధిక్యతని వ్యతిరేకించిన రాజుకు హిందూసంఘంలో తావు లేదు.[1]"

అని బెదరించి రాచరికపు వ్యవస్థకు వర్ణధర్మాన్ని నూరిపోశాడు. దానితో ధర్మస్మృతులతోపాటు. న్యాయశాస్త్రాలుకూడ కులానికి మధ్యన ఉక్కు-గోడలు నిర్మించాయి. ధర్మాలు, న్యాయాలు, చట్టాలు, నీతులు, సూక్తులు అన్ని కులాల్ని సమర్థిస్తూ కులంపరిధికి శాశ్వతత్వాన్ని చేకూర్చాయి. కౌటిల్యుడు వర్ణవ్యవస్థతోపాటు బానిసవ్యవస్థనుకూడ

---

1 కౌటిల్యుని అర్థశాస్త్రం పూర్వాపర్వాలు - సి. వి.

పటిష్ఠం చేశాడు. అయితే ఈ భావాలు అశోకుని పరిపాలనంతకాలము బౌద్ధంతో యుద్ధం చేసినవి, అశోకుని కాలంలో మాత్రం బౌద్ధమతాభ్యుదయం ఈ భావాలను సమాజంమీద పెత్తనం చేయకుండ అడ్డుకోగలిగింది. అయిన ఒకప్రక్క యజ్ఞయాగాదులు జరుగుతూనే ఉన్నవని చరిత్రకారుల చెబుతున్నారు,

భావసంఘర్షణాత్మకమైన ఈ కాలమున కులవ్యవస్థ బాగుగనే పాదుకొని ఉండనవచ్చును.

ఆకాలములో గ్రీకు రాజైన సెల్యూకస్ నికేటర్ చే చంద్రగుప్తమౌర్యుని ఆస్థానమునకు రాయబారిగా పంపబడిన మెగస్తనీసు భారతీయులలో ఏడు కులాలవారున్నట్లు వ్రాశాడు. (బ్రాహ్మణులు (Pnilosophers) 2 వ్యవసాయదారులు (Husbandmen) 3 పశుపాలకులు (Herdsmen) 4 వృత్తిపని (Artisam) వర్తక (Trading) జనులు 5. వేటగాళ్ళు 6 సైనికులు 7 అవేక్షకులు (Oversseers) లేదా ఉద్యోగులు. దీనినిబట్టి ప్రతి వృత్తి ఒక కులంగా రూపొందడం మౌర్యయుగంలో ప్రారంభమైనట్లు తెలుస్తుంది.

ఏదిఏమైన బ్రాహ్మణ వాదం తాత్కాలికంగా తలవంచినా తన నిజతత్వాన్ని వదలుకోలేదు. అశోకుని అనంతరం సైనిక తిరుగుబాటుల ద్వార మౌర్యుల అధికారము కూలద్రోయబడింది. ఈ కార్యమును నిర్వర్తించినవాడు బ్రాహ్మణసేనానియైన పుష్యమిత్రశుంగుడు. ఈతడు మౌర్యులరాజులలో కడపటి వాడైన బృహద్రథుని వధించి క్రీ. పూ. 187 ప్రాంతములో పాటలీపుత్ర సింహాసనము ఆక్రమించి శుంగవంశాన్ని స్థాపించాడు.

శుంగవంశకాలంలో బ్రాహ్మణమతం బాగా అభివృద్ధిచెందింది. తరువాత కాణ్వాయనులుకూడ ఈమతాన్ని అభివృద్ధి చేశారని చెప్పవచ్చు.

మౌర్యవంశం గతించి ఉత్తరాపథాన్ని శుంగరాజులు, దక్షిణా పథాన్ని శాతవాహనులు పాలిస్తున్న కాలంలో పంజాబ్, పశ్చిమ వాయవ్య సరిహద్దు ప్రాంతాలను విదేశజాతులవారు దండెత్తివచ్చి ఆక్రమించి రాజ్యాలు స్థాపించారు. ప్రథమంగా గ్రీకులు (యవనులు) తరువాత సిథియనులు (శకులు) పార్థియనులు (పహ్లావులు) తరువాత కుషానులు వచ్చారు.

ఈ కుషానులలో కనిష్కుడు గొప్పరాజు. ఈతడు బౌద్ధమతాభిమాని ఈతడు కుందవనం (కాశ్మీర్) లో బౌద్ధసంఘాన్ని సమావేశ పరచాడు. వసుమిత్రుడు అధ్యక్షుడుగా, అశ్వఘోషుడు ఉపాధ్యక్షుడుగా వ్యవహరించారు. బౌద్ధ ధర్మంపై విభాషా శాస్త్రాలనే వ్యాఖ్యలు తయారు చేశారు. వాటిని రాగిరేకులపై చెక్కించి కనిష్కుడొక స్థూపంలో భద్రపరచినట్లు బౌద్ధ వాఙ్మయము వలన తెలుస్తుంది. ఈ సంఘ సమావేశానంతరం కనిష్కుడు ఆసియా ప్రాంతాలలో ప్రచారానికి బౌద్ధ భిక్షువులను పంపాడు.

కనిష్కుని ఆస్థానపండితుడైన అశ్వఘోషుడు బౌద్ధమత సాహిత్యంలో తలమానికమైన 'బుద్ధచరిత్ర' 'సౌందరనందము' అనే కావ్యాలను 'శారిపుత్ర ప్రకరణ' మనే నాటకాన్ని వ్రాశాడు. మాధ్యమిక సిద్ధాంతాన్ని విపులీకరించి మహాయానాన్ని ప్రచారం చేసిన ఆచార్య నాగార్జునుడు కూడా కనిష్కుని ఆస్థానంవాడు. ఈవిధంగా ఈతడు బౌద్ధమతానికి సేవచేసి రెండవ అశోకుడుగా చరిత్రలో పేరుపొందాడు. అయితే ఈ కాలంలో ప్రచారమైన బౌద్ధమహాయానంపై హిందూమత ప్రభావం కొంతపడింది. కులవ్యవస్థలో ఏమీమార్పులేదు.

# గుప్తుల కాలంలో కులవ్యవస్థ

గుప్తులనాటి సాంఘికవ్యవస్థ వర్ణవ్యవస్థా పునాదులపై పటిష్ఠంగా కట్టబడింది. బౌద్ధుల ధాటినుండి మేలుకొని పునరుజ్జీవము పొందిన బ్రాహ్మణ మతము వర్ణవిభేదాలను గట్టిపరచింది. రాజులు వర్ణధర్మాలను రక్షించడమే తమ ప్రధానమైన బాధ్యతగా తలంచారు. ఈకాలంలోనే భారతీయుల మానవత్వాన్ని చంపిన మనుధర్మాన్ని క్రోడీకరించడం జరిగింది. పురోహిత వర్గం సమాజంమీద పెత్తనం చేయడం అధికమైంది బ్రాహ్మణులకు దక్షిణలు, దానాలు, మాన్యాలు ఇవ్వడం పుణ్యకార్యాలుగా ప్రభువులు ప్రజలు భావించారు. ప్రతి వృత్తి కులంగా మారింది. కులధర్మాలకు ప్రాధాన్యత పెరిగింది. కులధర్మాలను పాటించనివారిని అధికారికంగా వెలివేసి శిక్షించడం జరిగింది.

ఈ కాలంలో అస్పృశ్యత చాలా తీవ్రంగా ఆచరించబడింది. అంటరానివారుగా లెక్కించబడిన వీళ్ళు పశువులకంటె హీనంగా చూడబడ్డారు. వాళ్ళని తాకకూడదు. కళ్ళతో చూడకూడదు. వాళ్ళ మాట చెవులతో వినకూడదని శాసించారు. అట్లా వినడం మహా పాతకంగా భావించారు.

గుప్తసామ్రాట్టులు బ్రాహ్మణమతాభిమానులు. బ్రాహ్మణవర్గం నేరం చేసినా శిక్షలు అమలుజరుపలేదు. ఈ కాలంలోనే విగ్రహారాధన ప్రబలింది. విష్ణువు, శివుడు, కార్తికేయుడు. వినాయకుడు, పార్వతి, సరస్వతి మొదలగు దేవతలను పూజించారు.

వర్ణసంస్కృతిని ప్రబోధించే సంప్రదాయాలు, ఐతిహ్యాలు, కథలు, సిద్ధాంతాలు, కర్మలు, వేదాంతము, నీతిమొదలైన వాటితో పురాణాలు హిందూమత విజ్ఞానసర్వస్వాలుగా తయారయినాయి. మానవనైజమైన హేతుబుద్ధిని, తార్కికజ్ఞానాన్ని చంపి పురాణాలు

కళాత్మకంగా దుర్మార్గమైన వర్ణసంస్కృతితో కూడిన హిందూమతాన్ని ప్రచారం చేశాయి. యాగాలు, యజ్ఞాలు కూడా ఈ కాలంలో విరివిగా జరిగినవి. సముద్రగుప్తుడు తన దిగ్విజయాన్ని-అశ్వమేధయాగం ద్వారా ప్రకటించాడు. సముద్రగుప్తుని మనుమడైన కుమారగుప్తుడు కూడా అశ్వమేధయాగం చేశాడు. అయితే ఈ రాజులు క్షత్రియవంశానికి సంబంధించిన వారు కాదు. వైశ్యులై ఉండవచ్చునని చరిత్రకారులు భావిస్తున్నారు. "అయితే గుప్తరాజులకు పూర్వం క్షత్రియులు కావటం చాలా అరుదు. నందరాజులు శూద్రులు, మౌర్యులు హీనజన్ములుగా పరిగణింపబడినవారు తొలికాలపు దక్షిణప్రాంత చేది, చోళ, చేర, పాండ్య ఆంధ్రరాజులు తాము క్షత్రియులమని చెప్పుకోలేదు. పైపెచ్చు వారు అనార్యగణాలకు చెందినవారు. యవనులూ, శకులు, కుషానుల వంటి విజాతీయులను వ్రాత్యులుగా పరిగణించారు. పాణినీ, మనువు వారిని శూద్రుల క్రింద లెక్కకట్టారు. పురాణాలలోని కొన్ని రాజ వంశాలు క్షత్రియులవికావు.[2]" రాజ్యాధికారం కోసం సాంఘిక గౌరవంలో అగ్రస్థానంకోసం బ్రాహ్మణ క్షత్రియులకు చరిత్రలో విపరీతమైన సంఘర్షణ జరిగినట్లుగా తెలియుచున్నది. వర్ణధర్మాలను నిర్దేశించిన బ్రాహ్మణులే చరిత్రలో అవకాశం దొరికినప్పుడు బ్రాహ్మణధర్మాన్ని వదిలిపెట్టి రాజ్యాలు ఏలారు. బ్రాహ్మణ క్షత్రియ పోరాటకథలే కదా మన పురాణకథలు ఏది ఏమైనా గుప్తుల కాలంలో క్రోడీకరింపబడిన మనుస్మృతి మానవనాగరికతకు గొడ్డలిపెట్టు, వర్ణసంస్కృతికి కంచుకోట - ఆ మనుస్మృతిని పరిశీలిద్దాం!

---

2. బ్రాహ్మణులు - కొడవటిగంటి.

# మనుస్మృతి – వర్ణవ్యవస్థ

## బ్రాహ్మణాదివర్ణముల సృష్టి

లోకానాం వివృద్ధ్యర్థం ముఖబాహూరుపాదతః
బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం శూద్రంచ నిరవర్తయత్ ॥

తా॥ భూలోకవిస్తారమును కోరినవాడై బ్రహ్మ తనముఖము నుండి, బాహువులనుండి, ఊరువులనుండి, పాదములనుండి వరుసగా బ్రాహ్మణులను, క్షత్రియులను, వైశ్యులను, శూద్రులను సృజించెను
(అధ్యాయం 1–31వ శ్లోకం)

సమాజంలో ఒకానొకదశలో తలయెత్తి స్థిరపడిన వర్ణవ్యవస్థ చారిత్రక పరిణామ ఫలితంగా ఏర్పడింది కాక సృష్ట్యాదియందు దైవ నిర్ణయానుసారం ధర్మబద్ధంగా ఏర్పడింది అని చెప్పటానికి పూనుకొన్న ధర్మకర్తలలో మనువు ఒకడు. చాతుర్వర్ణ్యాలకు నిర్దిష్టమైన జీవన విధానాన్ని నిర్దేశించి, భారతీయ సామాజిక వ్యవస్థలో అసమానతలకు ఉక్కుపునాదులు నిర్మించాడు.

## బ్రాహ్మణుడు

అధ్యాపనంచ అధ్యయనం యజనం యాజనం తథా
దానం ప్రతిగ్రహంచైవ బ్రాహ్మణానామ కల్పయత్ ॥

వేదములను శాస్త్రములను చెప్పుటయు తాను చదువుటయు, యజ్ఞములు చేయుటయు, చేయించుటయు, దానము చేయుటయు, దానము గ్రహించుటయు ఈ ఆరు కర్మలను బ్రాహ్మణునికి ఏర్పరచెను.

ఈ కర్మలనాచరించు బ్రాహ్మణుడు ఈ నాడు ఒక్కడైన లేడు. కాలంమారింది. కర్మలూ మారినయి. బ్రాహ్మణుడుకూడా చెప్పాలి

కుట్టి జీవనము చేస్తున్నాడు. కాని బ్రాహ్మణ కులంముద్రమాత్రం పోలేదు. కులం వృత్తినిబట్టిగాక ఈనాడు జన్మనిబట్టి స్థిరీకరింపబండిది. అందుకే వేమన అంటాడు.

కులముచేతబట్టి గుంపించనేటికి
పాదుఉన్నచోట ప్రబలువిత్తు
ఏటికులంబింక ఎక్కడిద్విజుడయా? అని-

ఈ నగ్నసత్యం ఈనాడు తెలిసికొనిగూడ ఇంకా కులాన్ని అంటిపెట్టుకుని చుట్టూఉన్న మానవుల హీనంగా చూస్తున్నారు ఇది న్యాయమా?

## క్షత్రియ ధర్మం

ప్రజానాం రక్షణం దాన మిజ్యాధ్యయన మేవచ
విషయేష్వప్రసక్తిశ్చ క్షత్రియస్యసమాసతః

ప్రజాసంరక్షణము, దానము, యాగముచేయుట, వేదాధ్యయనము, విషయములందాసక్తి లేకుండుట, ఇవి క్షత్రియధర్మములు

ఈనాడు రాజులు లేరు రంగప్పలులేరు. అయినా రాజవంశాలు మావి అని విర్రవీగుచున్నవారు ఉన్నారు. రాచరికపు వ్యవస్థ కూకటివేళ్ళతో పెల్లగింపబడింది. రోషం దర్పంమాత్రం ఆవంశాలకు సంబంధించిన కొందరిమీాద పెత్తనం చేస్తుంది.

## వైశ్యలు

పశూనాం రక్షణం దాన మిజ్యాధ్యయన మేవ చ
వణిక్పథం కుసీదం చ వైశ్యస్య కృషి మేవ చ.

గోసంరక్షణము, దానము, యాగములు చేయుట, వేదాధ్యయనం చేయుట, నీటిమార్గమున. భూమార్గమున వ్యాపారం చేయుట, వడ్డీజీవనం, వ్యవసాయం, ఇవి వైశ్యుల ధర్మము.

భారతదేశంలో ప్రసిద్ధి చెందిన మతాలను ఆర్థికంగా పోషించింది వైశ్యులు. అయితే బౌద్ధం వీరికి సమానగౌరవాన్ని ఇవ్వగా- హిందూ మతం - మూడవస్థానం యిచ్చి సామాజిక గౌరవం వీరికి లేకుండా చేసింది,

అయితే వ్యవసాయం వైశ్యుల చేతినుండి, శూద్రుల కెప్పుడో రాగా, ఈ రోజు వ్యాపారం కూడా కేవలం వారి చేతుల్లోనే లేదు.

## శూద్రులు :

ఏక యేవ చ శూద్రస్య ప్రభుః కర్మసమాదిశేత్,
ఏతేషా మేవ వర్ణానాం శుశ్రూషా మనసూయతామ్.

పై వర్ణముల వారికి గుణనింద చేయక వారికి శుశ్రూష సల్పుటయే శూద్రధర్మము.

సమాజంలో అధిక సంఖ్యాకులై యుండి ఉత్పత్తిలో ప్రధాన పాత్రను వహించినప్పటికి పరాన్నభుక్కులైన బ్రాహ్మణసేవయే జీవిత పరమార్థంగా వారికి చెప్పిన మనువు - బ్రాహ్మణులచేత ఉన్నత ధర్మ కర్తగా కీర్తింపబడుటలో వింతలేదు కదా !

భూతానాం ప్రాణినః శ్రేష్ఠాః ప్రాణినాం బుద్ధిజీవినః,
బుద్ధిమత్సునరాః శ్రేష్ఠా నరేషు బ్రాహ్మణాః స్మృతాః.

సకల భూతారబ్ధములైన స్థావరజంగమరాసులలో ప్రాణులు శ్రేష్ఠులు. ప్రాణుల లోపల బుద్ధిజీవులు శ్రేష్ఠులు. బుద్ధిజీవులలో మానవులు శ్రేష్ఠులు. మానవులలో బ్రాహ్మణులు శ్రేష్ఠులు.

ప్రాణుల్లో బుద్ధిజీవులు - బుద్ధిజీవుల్లో మానవులు, మానవుల్లో బ్రాహ్మణులు - బ్రాహ్మణుల్లో బ్రహ్మవేత్తలు శ్రేష్ఠులంటున్నారు.

మరి యీ అత్యుత్తముడైన బ్రాహ్మణవేత్త ఉత్తముడైన మానవుణ్ణి, అస్పృశ్యుడని, అంటరానివాడని, చూడరానివాడని, వినరాని వాడని చెబుతూ,

ఆవుని, కుక్కని, ఎద్దుని, ఎలుకని, ఒక టేమిటి సర్వజంతుజాలాన్ని పూజ చేస్తాడెందుకో ?

**ఉత్తముండు.**

ఇంకా బ్రాహ్మణుని గొప్పతనాన్ని గూర్చి మనువు ఏం చెప్తూ చున్నాడో చూడండి.

ఉత్తమాంగమగు శిరమునుండి పుట్టుటవలనను, వేదములు ధరించుట వలనను, క్షత్రియాది వర్ణములకు ధర్మోపదేశము చేయుట వలనను వర్ణముల కెల్ల బ్రాహ్మణుడు ప్రభువు. [1]

అట్టి బ్రాహ్మణుని, బ్రహ్మదేవుడు, హవ్యకవ్యముల నొనర్చు నిమిత్తమై తప మొనర్చి, సర్వజగద్రక్షణకై తన మోమునుండి పుట్టించెను. [2]

ఏ బ్రాహ్మణుని మోముమూలమున వేల్పులు తమ కొసగ బడు హవ్యమును భుజింతురో అంతకంటె నెక్కువయైనది ఏమి వున్నది ? [3]

---

1. ఉత్తమాంగోద్భవా జ్జ్యైష్ఠ్యాద్బ్రహ్మణశ్చైవ ధారణాత్.
సర్వస్యైవాస్య సర్గస్య ధర్మతో బ్రాహ్మణః ప్రభుః.

2. తం హి స్వయం భూః స్వాద్దాస్యాత్తప స్తప్త్వాతోఽసృజత్,
హవ్యకవ్యాభి వాహ్యాయ సర్వస్యాస్య చ గుప్తయే.

3. యస్యాస్యేన సదాశ్నంతి, హవ్యాని త్రిదివౌకసః,
కవ్యానిచైవ పితరః కింభూత మధికం తతః,

(1-అ - 93, 94, 95 శ్లోకములు)

# విద్య

తరతరాలుగా విద్యావిత్తమును గుత్తకు తీసుకొని విద్య చెప్పే అర్హత తమ కొక్కరికే ఉన్నదని చాటి చెప్పుకొని, గురుపీఠాన్ని స్థాపించుకొని, శూద్రులకు, అస్పృశ్యులకు, స్త్రీ లోకానికి, విద్యాగంధ మంటకుండా మానవ నాగరికతకు దూరంగా నెట్టివేసి విజ్ఞానాన్ని తమ గుప్పిటలో పెట్టుకొని సమాజం మీద పెత్తనం చేసిన యీ వర్గం యోగ్య, అయోగ్యతల పేరుతో, ద్వేషం అసూయాహంకారాలతో అగ్రవర్ణాలకే విద్య చెప్పుకుంటూ జాతిపతనానికి కారకులయ్యారు.

"విద్యయైవ సమం, కామం, మర్తవ్యం బ్రహ్మవాదినా
ఆపద్యపి హి ఘోరాయాం నత్వేనా మిరిణేవపేత్. (2 అ-11౩వ శ్లో)

యోగ్యుడైన శిష్యుడు దొరకనప్పుడు, వేదాధ్యాపకుడు అట్టి విద్యతోడః దాను మృతినొందుటయే మేలు. ఎంత ఘోరమైన ఆపద వచ్చినను విద్యను చవిటినేలయందు విత్తకుము. (అనగా అపాత్రుని కొసంగకుము) అంటూ యింకా,

గురుపుత్రుడు, శుశ్రూష చేయువాడు, వేఱొక విద్య నేర్పువాడు. పరిశుద్ధుడు, బంధువు, చెప్పినది గ్రహించుట యందును, జ్ఞప్తియందుంచుకొనుట యందును సమర్థుడు. ద్రవ్యమియ్యగలవాడు, మేలుగోరువాడు, యీ పదుగురికిని, దక్షిణ నైకొనక చదువు చెప్పవలయును.[4] ఎవనికి ధర్మము, అర్థము రెండును లేవో, శుశ్రూషయు లేదో అట్టివానికిః జెప్పిన విద్య చవిటి చేనులో విత్తిన విత్తనమువలె వ్యర్థమగును కాన అట్టివానికి విద్య చెప్పదగదు.[5]

---

4. ఆచార్య పుత్రశుశ్రూషుర్జ్ఞానదో ధార్మిక శ్శుచిః,
ఆప్తశ్శక్తోఽర్థ దస్సా ధుస్స్వాధ్యాప్యా దశ ధర్మతః. (2-అ. 109)

5. ధర్మార్థౌ యత్ర నస్యాతాం శుశ్రూషా వాపి తద్విధా,
తత్ర విద్యా నవప్తవ్యా శుభం బీజమివోషరే. [2-అ. 112.]

ఈవిధంగా, మానవాభ్యుదయానికి జీవమైన విద్యను కొంత మందికే పరిమితం చేసిన మనువు - మనువు అనుయాయులు, కొన్ని వందల సంవత్సరాలు మానవవికాసానికి అడ్డుగోడగా నిలచారనుటలో అత్యుక్తి లేదు.

## ప్రశ్నిస్తే పాషండుడు

ప్రశ్నించడం వల్లనే మానవుడు యీ విశ్వతత్వాన్ని కనుగొన గలిగాడు. ప్రశ్న జ్ఞానాన్ని, ప్రాభవాన్ని, ప్రగతిని, బుద్ధిని, విద్యను విస్తృత పరుస్తుంది. విద్వత్తును పెంచుతోంది. ఆ ప్రశ్నను ఆపితే అభివృద్ధి లేదు, జడత్వం వస్తుంది. అజ్ఞానం, అవిద్య తాండవమాడతాయి. భావదాస్యం ప్రబలి. మనిషి పురోగమనం లేక తిరోగమించ వలసి వస్తుంది. మానవ ధర్మాన్ని, మానవత్వాన్ని మన్నుపాలు చేస్తున్న మనుధర్మాన్ని, ఎదిరిస్తే వెలివేయమంటున్నాడు మనువు.

యోఽవమన్యేత తేమూలే హేతుశాస్త్రాశ్రయాద్ద్విజః
నసాధుభిర్బహిష్కార్యో నాస్తికో వేదనిందకః

(2-అ-11శ్లో)

ఏ ద్విజుడు ప్రమాణములైన శృతిస్మృతులను హేతు తర్కాదులచే ఖండించుచు దూషించునో, అట్టి నాస్తికుని, వేదదూషకుని సాధువులు బహిష్కరింపవలయును.

శ్రుతిస్తువేదో విజ్ఞేయో ధర్మశాస్త్రం తువైస్మృతిః
తే సర్వార్థేష్వమీమాంస్యే తాభ్యాం ధర్మోహి నిర్బభౌ

(2 వ అధ్యాయం 10 శ్లోకం)

వేదములు శ్రుతి అనబడు ధర్మశాస్త్రములు స్మృతియనబడు ఆ రెండింటిలోని విషయములనుగూర్చి ప్రతికూల తర్కములు సేయరాదు ఆ రెండింటిచేత ధర్మము మిక్కిలి ప్రకాశితమయ్యెను.

ఈ విధంగా భావదాస్యశృంఖలాలు మనుష్యులకు తగిలించి, మానవాభ్యుదయానికి మూలమైన ప్రశ్నను భారతదేశమన స్తత్వంలోనే చంపి గొఱ్ఱెమన స్తత్వాన్ని పెంచిపోషించారు.

## ప్రశ్నించకపోతే – పరలోకం (స్వర్గం)

అగ్రవర్ణాలకు, అధికారాన్ని, అధ్యాపనాన్ని, అధ్యయనాన్ని గౌరవాన్ని, సుఖాన్ని, అన్నివర్ణాలను దోచుకొనే అధికారాన్ని ఇహ లోకంలో కల్పించి,

శూద్రులనుమాత్రం నీచంగా, దీనంగా, హీనంగాబ్రతుకుతూ, అగ్రవర్ణాలకు బానిసలై, కష్టాలను, నష్టాలను భరియిస్తూ వారికి సేవలు చేసుకొంటు ఈ లోకంలో బ్రతికితే పరలోకంలో సౌఖ్యం అని మనువు ఎర వేస్తున్నాడు.

శ్రుతిస్మృత్యుదితం ధర్మమనుతిష్ఠన్ హిమానవః
ఇహకీర్తి మవాప్నోతి ప్రేత్యచానుత్తమం సుఖమ్ ॥

(అ–2–9వ శ్లోకం)

మానవుడు శ్రుతులందు చెప్పబడిన ధర్మము ననుష్ఠిస్తూ ఇహలోకంబున సుఖమును పరలోకంబున మోక్షమును నొందును.

స్వర్గలోకం, పూర్వజన్మ – ఈ రెండింటి పునాదులమీదనే పురోహితవర్గం ఈ అధర్మశాసనాలను ధర్మాలుగా బోధించగలిగారు.

## శూద్రుడనర్హుడు

చాతుర్వర్ణాల్లో ఉపనయన సంస్కారం మూడు వర్ణాలకే విధించబడి వారుద్విజులైనారు. అయితే వాల్మీకికాలానికి బ్రాహ్మణులే ద్విజులుగా లెక్కించబడి మిగిలిన వర్ణాలు త్రోసివేయ బడినాయి.

In the time of vaalmiki only the Brahmins were 'durjas or twice born. Kshatriyas and Vaisyas must have acquired that status in subsequent ages (MY STUDIES in the RAMAYANA chapter X Caste — P. H. Gupta]

వైదికకాలమునుండి శూద్రులకు కర్మకాండలో భాగంలేకుండా చేశారు. పౌరోహిత్యం వీరికి చేయరాదన్నారు.

శూద్రులకు పురోహితుడైనవాడు తన పంక్తియందు కూర్చున్న యెంతమంది బ్రాహ్మణులను తన అంగములతో తాకునో, అతడు దాతకు అంతమందికి భోజనమిడిన ఫలమును పోగొట్టును.6

అంతేగాక చాకలై, మంగలై, కుమ్మరై, మాలికుడై, కారుకుడై, సౌచికుడై వేయేల సమస్త వృత్తులనాశ్రయించి తన శ్రమ శక్తితో జాతిజీవనానికే పట్టుగొమ్మయైన శూద్రుడు దానమియ్య కూడదట - బలవంతంగా యజ్ఞయాగాదులకు వారిసంపద కొల్లగొట్ట వచ్చునట -

చరిత్రనొక్కసారి ఆలోకిస్తే ఎందరు శూద్రరాజుల నాశ్రయించి బ్రాహ్మణులు పొట్టపోసుకొన్నారు, ఈనాటికి శూద్రుల దానాలతోనే కదా పేరు జీవిస్తుంది,శూద్రులదానం గైకొన్నవాడికి బ్రాహ్మణత్వమే మాసిపోతే ఈవేళ బ్రాహ్మణవ్యవస్థే లేదని చెప్పాలి.

వేదవేత్తయగు విప్రుడైనను ఈ శూద్రయాజకునికడ నుండి ఆశచేదానమును గైకొనెనేని, కాలనిమంటికుండ నీటిలోపడి కరగినట్లు నశించునట.7

---

6 యావతస్సం స్పృశేదంగై ర్బ్రాహ్మణా శ్శూద్రయాజకః
తావతాం నభవేద్దాతుః ఫలందానస్య పౌర్త్వికమ్।
7 వేదవిచ్చాపి విప్రోఽస్య లోభాత్కృత్వాప్రతిగ్రహమ్
వినాశం వ్రజతిక్షిప్రమామ పాత్రమివాంభసి॥

గర్భాదానం. పుంసవనం, సీమంతోన్నయనం, నామకరణం, అన్నప్రాసనం మొదలగు సంస్కార కర్మలపేరుతో శూద్రరాజుల దగ్గర జమిందారుల దగ్గర సమస్తదానాలు స్వీకరించిన ఉత్తమ బ్రాహ్మణులే కదా! ఈ వేళ బ్రాహ్మణకులంలో అధికులు, దీనినిబట్టి బ్రాహ్మణబిరుదు తొలించుకొన్న వారుతప్ప బ్రాహ్మణులు ఈరోజున లేరు. అయినా ఊరూరికి బ్రాహ్మణసంఘాలున్నాయి. బ్రాహ్మణహోటళ్లున్నాయి. బ్రాహ్మణ వీధులున్నాయి. స్మృతుల్లో చెప్పిన బ్రాహ్మణత్వంమాత్రం ఎవరిలో మనకు నుచ్చుకైనా కనిపించుటలేదు. వీళ్ళ బ్రతుకు తెరువుకోసం తరానికొక ధర్మాన్ని వీళ్ళుమాత్రం మార్చుకోవచ్చు మిగిలిన వర్ణాలకు మాత్రం శాశ్వతంగా ధర్మాలుమారవు. ఇదేమిన్యాయమో అర్థంకావడంలేదు.

## చెవుల్లో సీసం కరిగించిపోయండి

దుష్టనీతిని దుష్టధర్మాన్ని ప్రవచించి సామాజికాధిపత్యాన్ని వహించిన పురోహితుడు తన ధర్మాన్ని, తనజాతిని, తనను ఎదిరించిన వాణ్ని క్రూరంగా - శిక్షించమని శాసించాడు. ఎంతమంది విప్లవ వీరులు వీరికర్కశ శాసన కరాళధారలకు నెత్తురులు ధారవోశారో !:

ఏకజాతి ర్ద్విజాతీంస్తు వాచాదారుణయా క్షిపన్
జిహ్వాయాః ప్రాప్నుయాచ్ఛేదం జఘన్య ప్రభవో హిసః.
(అ-8 శ్లోకం-270)

శూద్రుడు ద్విజుడగు మానవులను, 'పాపిష్ఠా' యీ మొదలగు పేరులతో, పిల్చినట్లయిన, నాలుక కోయవలయును. ఏలయన, అతడు హీనమైన పాదమునుండి జన్మించెను గదా.

నామజాతి గ్రహం త్వేషా మభిద్రోహేణ కుర్వతః,
నిక్షేప్యోఽయోమయ శ్శంకుర్జ్వలన్నాస్యే దశాంగుళః.

'ఓరీ యజ్ఞదత్తా! నీవు చెడ్డబాపనవాడవు' అని యీ మొదలగు విధంబున, పేర్లతో, బిల్చి దూషించెనేని, అట్లు దూషించిన

వాని నాలుక మీద బగబగమండుచుండు పదియంగుళముల నిడుపుగల కర్రను గాల్చి పెట్టవలయును.

(అ_8 శ్లోకం_271)

ధర్మోపదేశం దర్పేణ విప్రాణామస్య కుర్వతః
తప్తమాసేచయే త్తైలం వక్త్రే శ్రోత్రే చ పార్థివః

ఎట్టులో యించుకంత ధర్మము 'దెలిసికొని, అహంకారముచే 'ఇది నీవనుష్ఠింప వలసిన ధర్మము' అని బ్రాహ్మణునకు ఉపదేశము చేయు శూద్రునికి చెవి యందును, నోటిలో కాచిన తైలమును రాజు పోయింపవలెను. (అ_8 శ్లోకం_272)

ఈవిధమైన దుష్టనీతిని ప్రవచించిన మనువు బ్రాహ్మణవర్గాల దుర్మార్గతత్వాన్ని ఎదిరించకుండ వారి ఉక్కుపాదాల క్రింద మిగిలిన వర్ణాలు అణిగి, మణిగి, బానిసలుగా, బ్రతికేటట్లు శాసించాడు. అధికార తత్వాన్ని వారి కెక్కించి, బానిస మనస్తత్వాన్ని వీరికి అలవరించి తరతరాలుగా వారిని, నుతిస్తూ, కీర్తిస్తూ, ఎదిరించడం, ప్రశ్నించడం అనేది లేకుండా చేశాడు.

ఇంత అన్యాయం జరిగినా, ఇంతపాతాళానికి తోసినా, ఇంత వేధించినా, బాధించినా ఎదురు తిరగక పోవటానికి కారణం ఈ శాసనాలే. ఈ దేశంలో సామాజిక విప్లవం రాకపోవడానికి కారణం ఈ శాసనాలే. సామాజిక రుగ్మతను నిర్మూలించే ఒక్క విప్లవంకూడ రాకపోవడానికి కారణం క్రిందివర్ణాలకు తరతరాలు విద్యాగంధం లేకుండా — విజ్ఞానానికి దూరంగా ఉంచడంవల్లనే. ఎవడేని విప్లవ మూర్తి సాహసించి ఎదురు తిరిగితే ఈసూక్తుల నడ్డంపెట్టుకొని వాడి నెత్తురు జుర్రేవరకు వీళ్ళు నిద్దురపోయేవాళ్ళు కాదనేది తెలుస్తుంది.

తాత్వికవిద్యనుండి, లౌకికవిద్యనుండి, యుద్ధవిద్యనుండి దూరం చేయబడిన వీళ్ళు వైజ్ఞానికంగా, మానసికంగా, శక్తి సామర్థ్యాలతో, బలదర్పాలతో ఎదిరించలేక పోయారు.

తాత్వికవిద్య నభ్యసించిన బ్రాహ్మణులు, అలౌకిక, ఆధ్యాత్మిక సార్వభౌములమని. మహాత్ములు. మహిమలు మా సొత్తని, తంత్రాలు, మంత్రాలు మా కరతలామలకమని, ప్రపంచాన్ని శాసించగలమని, బ్రహ్మజ్ఞానులమని, ప్రాజ్ఞులమని, తత్వజ్ఞులమని, తమ్ము నెదిరించిన వాడినాలుకను కోయాలని ఇనుపకడ్డీని కాల్చి నాలుకమీద వాతపెట్టాలని చెవుల్లో, నోట్లో సీసం కరగించి పోయాలని శాసించారు బెదిరించారు.

ఇక రాజులు; అధికారదర్పాన్ని వరించి, యుద్ధసామగ్రిని తమ చేతుల్లో పెట్టుకొని, సైన్యాన్ని, పురోహిత సైన్యాన్ని అండగా పెట్టుకొని మిగిలిన వర్ణాలను అణచివేశారు.

ఇక వైశ్యులు; ఆర్థికబలంతో పురోహిత, క్షత్రియవర్ణాలకు దక్షిణాలు, దానాలు, కానుకలు. సమర్పించుకొని వారి అండదండలతో బ్రతికారు.

బుద్ధిబలం లేక. యుద్ధబలం లేక, ఆర్థికబలంలేక, శూద్రులు, అస్పృశ్యులు వారి ఉక్కుపాదాలక్రింద అణగద్రొక్కుతున్నా ఏమను తిరగలేక నెత్తురులో వేడిచచ్చి బానిసత్వపు బ్రతుకులతో జవంచచ్చి, జీవంచచ్చి ఇది మనకర్మ అని పూర్వజన్మపు పాపమని మానవత్వపు విలువలన్నీ మసికాగా - బానిసత్వపు బ్రతుకులు బ్రతికారు. దాసులై అణగిమణగి గానుగ ఎద్దుల్లాగ శ్రమశక్తిని ధారబోసి మన్నుదున్ని బంగారపుపంట పండించి చెమట నెత్తురులతో రాజుగారి బొక్కసాలు నింపినింపి రాజే దైవమని పూజించి, భజించి దేవతలే దిగివచ్చి బ్రాహ్మణులుగా పుట్టారని, నమ్మి వార్ని పూజించి మానవులై పుట్టి బానిసలుగా బ్రతికారు బానిసలుగా చచ్చారు.

ఈనాటికి ఈ బానిసత్వపు సంకెళ్ళను భేదించుకోలేక పోవడానికి కారణం ఈ దుష్టశాసనాలను మసిజేయలేక పోవడానికి కారణం

ఈ వాతభావాల, విశ్వాసాల బురకాలనుండి బయటపడి ఈ కులాల ఉక్కుపునాదుల్ని ఛేదించి; సమతా, మానవత్వాల నవీనపునాదుల మీద నవీనజాతిని, నవీననీతిని నవీనరీతిని నిర్మించడానికి నడుంకట్టే వీరులు లేకపోవడమే.

అందుకే - సాంఘికపోరాట సమరంలో పోరాడే యుద్ధవీరులు కావాలి. అప్పుడే అభ్యుదయం, విప్లవోద్యమం.

## వర్ణసంకరము :

ఈ చాతుర్వర్ణ్య వ్యవస్థ ఇట్లాఉంటే – ఇంకా మనువు వర్ణ సంకరంపేరుతో - ఉపకులాలను సృష్టించి, మనిషి మనిషికీమధ్య అంతర్యాలు పెంచు చున్నాడు.

మనుష్యులను నాలుగు వర్ణాలుగా విభజించనేల ?

అవిసంకర మైనవని గోలపెట్టనేల ?

బ్రహ్మముఖ, బాహు, ఊరు, పాదాలనుండా వచ్చిన నాలుగువర్ణాలు సంకరమై లేక అవుతుంటే బ్రహ్మ ఏమిచేస్తున్నాడు ? మానవస్వభావాన్ని, వ్యక్తిత్వాన్ని శాసనాలతో అడ్డుకోవాలంటే ఎంతవరకుసాధ్య పడుతోంది ?

బ్రాహ్మణ - క్షత్రియ – వైశ్య - స్త్రీలను క్రిందివర్ణాలతో కలుప వద్దని శాసించి, దండించి, బాధించి, వేధించారు. కానివాళ్ళు ఆగారా? సరే శాసించిన పురోహితులు నిష్ఠగాఉన్నారా ? ఉంటే అనులోమ-విలోమ క్రమంలో వర్ణసంకరం ఎట్లాజరిగింది ? శాసించిన ఋషులు అస్పృశ్య కాంతలను ఎలా వివాహమాడారు ? ఎలా పిల్లల్నికన్నారు? వశిష్ఠుడు అరుంధతిని ఎలా చేసుకున్నాడు ? శక్తి అదృశ్యంతిని, పరాశరుడు బెస్తకన్యను ఎందుకు చేసుకుని పిల్లల్ని కన్నారు ?

వర్ణసంకరంవల్ల క్రొత్త జాతుల్ని ఈ విధంగా చెబుతున్నాడు మనువు —

"స్త్రీష్వనంతర జాతాసు ద్విజై రుత్పాదితాన్ సుతాన్ !
సదృశానేవ తానాహుర్మాతృ దోష విగర్హితాన్:: (అ 10-శ్లో 6)

| సంకరమైన జాతులు | క్రొత్తజాతి | వృత్తి |
|---|---|---|
| బ్రాహ్మణునకు + క్షత్రియస్త్రీయందు పుట్టినవాడు | మూర్ధాభిషిక్తుడు | గుఱ్ఱములను ఏనుగులను మచ్చికచేయుట, రథములు తోలుట |
| బ్రాహ్మణునకు + వైశ్యస్త్రీయందు పుట్టినవాడు | అంబష్ఠుడు | |
| బ్రాహ్మణునకు + శూద్రస్త్రీయందు పుట్టినవాడు | నిషాదుడు | |
| క్షత్రియునకు + వైశ్యస్త్రీయందు పుట్టినవాడు | మాహిష్యుడు | నృత్యగీతములు, జ్యోతిష్యము |
| క్షత్రియునకు + శూద్రస్త్రీయందు పుట్టినవాడు | ఉగ్రుడు | |
| వైశ్యపురుషునకు + శూద్రస్త్రీయందు పుట్టినవాడు | కరణుడు | ద్విజశుశ్రూష, ధనధాన్యాదులు కాపలా, రాజసేవ, దుర్గమును అంతఃపురమును కాచుట. |

(వీరు సవర్ణ స్త్రీలకు పుట్టినవారికంటే నీచులనబడుదురు)

| | | |
|---|---|---|
| బ్రాహ్మణస్త్రీ + క్షత్రియుడు | సూతుడు | |
| బ్రాహ్మణస్త్రీ + వైశ్యుడు | వైదేహకుడు | |
| బ్రాహ్మణస్త్రీ + శూద్రుడు | చండాలుడు | |
| క్షత్రియస్త్రీ + వైశ్యుడు | మాగధుడు | |
| క్షత్రియస్త్రీ + శూద్రుడు | క్షత్త | |
| వైశ్యస్త్రీ + శూద్రుడు | అయోగవుడు | |

వీరిందరిలో చండాలుడు ఒక్కడే స్పర్శ కనర్హుడా ?

"ఏకాంతరే త్వాను లోమ్యాదంబష్ఠోగ్రౌ యథా స్మృతౌ.
క్షత్తృ వైదేహకౌ తద్వత్ ప్రాతిలోమ్యేఽపి జన్మని."
(అ 10-శ్లో 13)

ఒకటి విడిచిన వర్ణమున అనగా అనులోమమున బ్రాహ్మణునకు వైశ్యస్త్రీ యందు పుట్టిన అంబష్ఠుడు, క్షత్రియునకు శూద్రస్త్రీ యందు పుట్టిన ఉగ్రుడును ఎట్లు తాకదగినవారలో; అట్లే ఒకటి విడిచిన వర్ణమందు ప్రతిలోమమునను శూద్రునకు క్షత్రియ స్త్రీ యందు పుట్టిన క్షత్తృ వైశ్యునకు బ్రాహ్మణి యందు పుట్టిన వైదేహుడును, స్పర్శ్యాదులకు అర్హులే అగుదురు. ఒకటికంటె వెంబడి జాతియందు పుట్టిన వారెట్లు స్పర్శ్యాదులో అట్లు రెండు విడిచిన జాతులందు పుట్టిన సూత, మాగధ, అయోగవులును స్పర్శార్హులగుదురు. కనుక ప్రతిలోమ జాతులలో చండాలు డొక్కడే స్పర్శ్యాదుల కర్హుడుకాడు. అని మనువు నిర్ణయించాడు.

## నీచకులములు - 35.

"ప్రతికూలం వర్తమానా బాహ్యాబాహ్యతరాన్ పునః,
హీనాహీనాన్ ప్రసూయంతే వర్ణాన్ పంచదశైవతు."
(అ 10-31 శ్లో)

ఈ విషయమే విస్తరింపబడుచున్నది. శూద్రుని వలన వైశ్య, క్షత్రియ, బ్రాహ్మణ స్త్రీల యందు పుట్టినవారు వరుసగా అయోగవ, క్షత్తృ, చండాలురు. వీరు ప్రతిలోమజాతులు. కనుక బాహ్యులు. ఈ బాహ్యులగు అయోగవ, క్షత్తృ, చండాలురు ముగ్గురును తమ జాతిస్త్రీల యందును, తమకంటె పై జాతులగు చాతుర్వర్ణ్య స్త్రీల యందును, తమకంటె నీచులైనందున మిక్కిలి బాహ్యులగు

గర్భాదానము మొదలు అంత్యేష్టి వరకుగల అనుష్ఠాన సమూహము ఏ ద్విజునకు విధింపబడియున్నదో వానికే ఈమనుస్మృతి చదువుటకు అధికారముకాని ఇతరులగు శూద్రాదులకులేదు.

## వర్ణభేదములననుబట్టి కప్పములు

సామాన్యుడి మూలుగు ఎముకను చివరంటపీల్చిన రాచరికపు వ్యవస్థలో రాజుల భజంత్రీలైన బ్రాహ్మణవర్గముతప్ప మిగిలినసమస్త వృత్తికారుల రక్తమును కప్పముల రూపమున పీల్చుకున్నారు అనుటలో అత్యుక్తిలేదు. రాజులను బ్రాహ్మణుల దగ్గరతప్ప మిగిలినవారి దగ్గర జలగలు రక్తంపీల్చినట్లు పీల్చమంటున్నాడు.

[7అ. 129 శ్లో]

"మ్రియమాణోఽప్యాదదీత నరాజాశ్రోత్రియాత్కరమ్
నచక్షుధాస్య సంసీదేచ్ఛ్రోత్రియో విషయేవసన్" [అ 7-133 శ్లో]

వేదాధ్యయన పరుడైన శ్రోత్రియుని కడనుండి రాజుకప్పమును గైకొనరాదు. ఆరాజు దేశమునన్ను శ్రోత్రియ బ్రాహ్మణుడు వస్తుచే నకనక లాడరాదు.

బ్రాహ్మణు లెంత వరకు అథఃపతితులుగారో అంతవరకును వైదిక ధర్మమునకు నాశనములేదని ఆదిశంకరులు భగవద్గీతా భాష్యమునను డివిరి. వారివాక్యము ల్క్రిందివి -

"బ్రాహ్మణత్వస్యహి రక్షణేన రక్షితస్స్యా ద్వైదికోధర్మః"

బ్రాహ్మణులనుండి రాజులు కప్పములు గైకొనుటలేదు.

ఈధర్మములు తేలికైనవికావు. ఇవి ఈ దేశమును సుమారు క్రీ॥శ॥ 1800 వరకు పరిపాలించినవి. సామాన్యుని దోచుకొని బ్రాహ్మణునకు కొవ్వుపెంచినవి.

"యస్యరాజ్ఞస్తు విషయే శ్రోత్రియస్సీదతిక్షుధా
తస్యాపి తత్క్షుధారాష్ట్రమచిరేణైవ సీదతి."

(అ–7 శ్లో. 134)

ఏ రాజు దేశమునందు శ్రోత్రియుడు ఆకలిచే నకనకలాడునో, అట్టి రాజు దేశమునందు జనులు క్షామపీడితులై ఆకలిచే చిక్కిపోదురు.

అనిరాజు బ్రాహ్మణుని కాపాడుటయే తనధర్మంగా వారికి నాలుగు కూరలు, నవకాయపిండివంటలతో సంతర్పణలు చేయుటయే తన కర్తవ్యంగా పెట్టుకొని శూద్రుల చెమటనుపిండి, రక్తమును ఓడ్చి వీరికి నేయిగా వడ్డించినాడు.

శూద్రునకు ఎలాంటి పన్నులో చూడండి.

"పంచాశద్భాగ ఆదేయోరాజ్ఞా పశుహిరణ్యయోః
ధాన్యానామష్టమోభాగః షష్ఠోద్వాదశ ఏవవా"

[అ–7 శ్లో 130]

పశువులలోను, బంగారములోను రాజు నూటికి ఏబదివంతు కప్పమును గైకొన వలయును. ధాన్యములో ఆఱవపాలుగాని, ఎనిమిదవ పాలుగాని, పంద్రెండవ పాలుగాని సాలునకొక పరి కప్పము గైకొన వలయును.

"కారుకాన్ శిల్పినశ్చైవ శూద్రాం శ్చాత్మోప జీవినః
ఏకైకం కారయేత్కర్మ మాసి మాసి మహీపతిః".

(అ–7 శ్లో. 138)

శిల్పులకంటె యించుక ఉత్తములయి పిండివంటలు మొదలగు నవి చేయువారిని, లోహకారులు మొదలగు శిల్పులను, దేహపరిశ్రమచే జీవించు వారలగు శూద్రులను నెలకొకదినము పని చేయించుకొన వలయును. వెట్టిచాకిరి విధానం ఇక్కడ కనిపిస్తుంది.

ఈ విధంగా శ్రమించి పాడిపంటలను అభివృద్ధి చేయువారిని శూద్ర జాతులని వారిని దాసులుగా లెక్కించి, వారికి విద్య లేకుండ జేసి తమ్ముతాము రక్షించుకొనుటకు ఆయుధములను కూడ వారు ధరించ కుండ శాసించి వారిని నిరాయుధులుగా, విద్యావిహీనులుగా చేసి వారిసంపదనంత దోచుకొని; సాంఘికంగా, ఆర్థికంగా వారికి గౌరవం లేకుండ చేసిన ఈ బ్రాహ్మణ వ్యవస్థ రానురాను చాల క్రౌర్యంగా మారింది.

"గుప్తరాజుల అనంతర కాలంలో బౌద్ధం వెనుకబడిన మీదట బ్రాహ్మణుల బాపుటా బాగా ఎగిరింది. ఆర్థిక వ్యవస్థకు బ్రాహ్మణుల మతాధికారం అవసరమయ్యింది. ఈ కాలంలో భూదానాలు విస్తారంగా జరిగాయి. అధికారాన్ని శాస్త్రసమ్మతం చేసేశక్తి బ్రాహ్మణులకు ఉండేది. బ్రాహ్మణులు అధికారులుగా నియోగించ బడ్డారు. కొందరు బ్రాహ్మణులకు వ్యష్టిగానూ, సమిష్టిగానూ అగ్రహారాలు, బ్రహ్మదేయాలు లభించాయి. అలాంటి బ్రాహ్మణులు గొప్ప శాస్త్ర విశారదులో 'మత సంబంధమైన సేవ చేసినవారో' రాజుకు వంశవృక్షాలు తయారు చేసినవారో అయి ఉంటారు.

బ్రాహ్మణుల పలుకుబడికి దేవాలయాలు మంచి పట్టుకొమ్మలు. తొలికాలపు హిందూ దేవాలయాలు చిన్నచిన్న గుడులు. కాని క్రీ॥ శ॥ 500 తరువాత అవి మహత్తరమైన సంస్థలుగా తయారయినాయి. వాటికి విస్తృతమైన మాన్యాలూ, దాతలు యిచ్చిన అంతులేని ధనమూ ఏర్పడ్డాయి. అవి ఉన్నత బ్రాహ్మణ విద్యా కేంద్రాలు కూడాను. ఈ కాలంలో కాన్వెంటు చదువుల లాగ ఆ కాలంలో ఉన్నతవిద్య పై తరగతులకు మాత్రమే లభ్యమయ్యేది. గుప్తరాజులకు పూర్వం ఎలాగైతే బౌద్ధ విహారాలనుంచి 'విజ్ఞానం' వ్యాప్తి చెందిందో; ఇప్పుడు అదేవిధంగా దేవాలయాలనుంచీ, మఠాలనుంచీ వ్యాప్తి అవుతూ వచ్చింది". [8]

8 బ్రాహ్మణులు — కొడవటిగంటి కుటుంబరావు.

ఇట్లు బ్రాహ్మణులు రాజులను తమచేతిలో పెట్టుకొని శూద్రులను రాజుగారి దరిదాపులకు కూడా రాకుండా శాసనము చేసెను.

"జాతిమాత్రోప జీవీ వాకామం స్యాద్బ్రాహ్మణబ్రువః,
ధర్మ ప్రవక్తా నృపతేర్నతు శూద్రః కథంచన."
(అ_8. 20 శ్లో.)

ధర్మశాస్త్రాభిజ్ఞుడు కాకపోయినను వ్యవహార పరిశీలకుడయి ఉండవలయును. అట్లు కాదేని యోగ్యుడైన క్షత్రియుడైనను, వైశ్యుడైనను ధర్మప్రవక్తగా నుండవచ్చును. కాని శూద్రుడట్టి ధర్మప్రవక్తగా నుండరాదు కావున ప్రయత్నపూర్వకంగా నృపాలుడు శూద్రుని ధర్మప్రవక్తగ నియమింపరాదు.

ఎంత దుర్మార్గమైన శాసనమో ఒక్కసారి ఆలోచించండి. గుణకర్మ విభాగము చేసిన గీతకారుడు ఇప్పుడేమంటాడో ? కేవలం పుట్టుకచే బ్రాహ్మణుడైన మాత్రమునవాడు నీచుడైనను గౌరవము ఇమ్మనుచున్నాడుగదా! శూద్రుని ధర్మప్రవక్తగా నిర్ణయింపరాదని గట్టిగా శాసించుటచేతనే మంత్రిత్వమునకు బ్రాహ్మణులే అర్హులుగా రాజులు గుర్తించారు. ఎందరో ప్రతిభావంతులైన శూద్రులు కులం పేరుతో ఈసడించబడ్డారు.

"యస్య శూద్రస్తు కురుతే రాజ్ఞో ధర్మ వివేచనం,
తస్య సీదతి త ద్రాష్ట్రం పఙ్కే గౌరివ పశ్యతః."
(అ_8. 21 శ్లో.)

ఏ రాజునకు శూద్రుడు ధర్మవివేచనము చేయునో, అట్టి రాజు చూచుచుండగనే, అతని రాజ్యము అడుసున దిగబడిన గోవువలె నశించును.

"యద్రాష్ట్రం శూద్ర భూయిష్ఠం నాస్తికాక్రాంతమద్విజం,
వినశ్యత్యాశు తత్కృత్స్నం దుర్భిక్ష వ్యాధిపీడితమ్.
(అ_8. 22 శ్లో.)

ఎవని రాజ్యము శూద్రులచే నిండినదై దేవుడులేడని వాదించు నాస్తికులతో చుట్టుకొనబడి ద్విజులు లేనిదై యుండునో ఆ రాజు రాజ్యమంతయు క్షామపీడితమై వేగమే నశించెడి.

ఈ సూత్రాల అస్త్రాలతోనే ఎందరో నాస్తికుల, లోకాయతుల మస్తకములను నరికివేయించారు. ఎంతోకాలం శూద్రుల శక్తి సామర్థ్యాలు ఎందుకు కొరగాకుండగ చేశారు. అజ్ఞానాన్ని కర్మ సిద్ధాంతాన్ని వీరికి బోధించారు. కావుననే బ్రహ్మ వ్రాసిన వ్రాతను ఎవరూ తప్పించలేరనే నమ్మకముతో భావదాస్యానికి గురియై దాసానుదాసులుగా వీరు బ్రతకవలసివచ్చింది. ఈరోజు కర్మసిద్ధాంతమునుండి ఇంకా మనిషి బయటపడలేదు. బ్రాహ్మణులు వారి స్వప్రయోజనము కోసం నూరిపోసిన ఈ ఆచారాలు, సంప్రదాయాలు, దేవుడు, కర్మ ఇవన్నీ మనిషిని వీడలేదు. ఇవాళ భారతదేశంలో మనుషులు లేకుండ పోయారు. మానవత్వాన్ని ధర్మానికి, శౌర్యాన్ని కర్మకి, మనుగడని ఆచారాలకు అమ్ముకున్నారు. వీరిని చైతన్యవంతులను చేసి వీరికి జరిగిన అన్యాయాన్ని ఎలుగెత్తిచాటినా వీరి చెవులకు దైవభావమనే ఇనుప గోడలు కట్టబడి ఉన్నందువలన వీరు వినలేరు.

కులాల హాలాలు ఇన్నిగుండెల్ని దున్నుతున్నా ఇంత వేడి నెత్తురు కులంపేరుతో ఎడారిలో ఇంకిపోతున్నా ఇంతమంది శ్రమజీవుల శ్రమను కర్మపేరుతో దోచుకుంటున్నా కులాల కుమ్ములాటల మారణ హోమంలో మనిషి నుసిగా మారుతున్నా కులాల పునాదుల మీద రాజకీయ దుండగులు పరిపాలన సాగిస్తున్నా ఎన్నో విప్లవ సౌధాలు కులాల పేరుతో ముక్కచెక్కలవుతూన్నా మనిషి మేలుకోలేకపోవడానికి కారణం, మనిషి మనిషిగా నిలబడకపోవడానికి కారణం ఈ ధర్మసూత్రాలు మనిషి నరనరాల్లో కథలుగా గాథలుగా ఎక్కడమే. ముందు వీటిమత్తును వదిలించాలి. మనిషి రక్తంలో ఇంకిపోయిన ఈ విషాన్ని పిండాలి. మనిషిని మనిషిగా చేయాలి.

అంతవరకు ఏవిప్లవ సిద్ధాంతాన్ని భారతదేశంలోని మనిషికి ఎక్కించలేము అనేది నగ్నసత్యం.

మనువు శూద్ర వర్ణములకు క్రూరమైన దండనలు విధించాడు. బ్రాహ్మణులకు మాత్రం ఎంత దుష్టులైనను దండింపులేకుండునట్లు శాసించాడు.

"తాడయిత్వా తృణేనాపి కంఠే వా బద్ధ్వ వాససా,
వివాదే వా వినిర్జిత్య ప్రణిపత్యప్రసాదయేత్''

(అ. 11-205 శ్లో)

బ్రాహ్మణుని తృణముతోనైనను గొట్టినను, మెడకు బట్టవేసి ఈడ్చినను, వాదులాటయందు జయించినను వానిని నమస్కరించి సమాధాన పరచ వలయును.

''అడిచినఁదిట్టినఁ మరి మహాపరుషంబులు పల్కి అల్కతోఁబొడిచిన ఉత్తమ ద్విజులుపూజ్యులు''

అని నన్నయ భారతములో అన్నాడుకదా!

"అవగూర్యత్వబ్దశతం సహస్రమభిహత్యచ
జిఘాంసయా బ్రాహ్మణస్య నరకం ప్రతిపద్యతే''!

(అ 11-206 శ్లో)

బ్రాహ్మణుని చంపగోరి కొయ్యపై కెత్తినేని నూరేండ్లు నరకము నొందును. కొయ్య మొదలగు వానితో కొట్టినేని వేయి సం॥ ములు నరకము పొందును.

ఇట్లు శాసించిన మనువే బ్రాహ్మణేతరుల విషయంలో ఏమను చున్నాడో చూడండి. —

పరస్య దండం నోద్యచ్ఛేత్క్రుద్ధోనైనం నిపాతయేత్
అన్యత్ర పుత్రాచ్ఛిష్యాద్వా శిష్ట్యర్థం తాడయేత్తు తౌ"

[అ 4-134 శ్లో]

పసుని కొట్టుటకై కఱ్ఱను పైకెత్తరాదు. కోపముతో అట్లు పైకెత్తిన కఱ్ఱను విసరివేయరాదు. ఒకప్పుడు కొడుకు శిష్యుడు [భార్య — పనివాడు] వీరు నేరము చేసిరేని వారిని మాత్రము తగినట్లు త్రాటితోనైనను, బెత్తము. వెదురుకఱ్ఱ మొదలగు వానితో నైనను కొట్టవచ్చును.

"తాడయిత్వా తృణే నాపి సంరంభాన్మతి పూర్వకం
ఏక వింశతమా జాతీః పాపయోనిషు జాయతే"

[అ 4 – 166 శ్లో]

బ్రాహ్మణుని క్రోధముతో బుద్ధిపూర్వకముగా తృణముతో నైనను కొట్టినయెడల ఇరువది యొక్క జన్మములు కుక్కలు మొదలగు నీచయోనులయందు జన్మించును.

అంతేగాక బ్రాహ్మణునికి గాయములు ఎవడైన చేసెనేని ఆ బ్రాహ్మణుని శరీరమునుండి కారిన రక్తము నేలయందు ఎన్ని రేణువులను తడుపునో; అన్ని సం॥ ముల కాలము ఆగాయ మొనర్చిన వానిరక్తము నక్కలు మున్నగునవి పీల్చుకొనును. [అ 4-167,168 శ్లో] అని భయం కలిగించారు.

బ్రాహ్మణాధిక్యతను పెంచి, రాజులచేత బ్రాహ్మణులను పొగిడించి, బ్రాహ్మణరక్షణయే రాజుల కర్తవ్యంగా నిర్దేశించి, మొత్తం సమాజాన్ని బ్రాహ్మణుల పాదదాసులుగా చేసి, కొన్ని వేల సం॥ములు వారిని ఊడిగం చేయడానికి శాసించి; ధర్మం, చట్టం. గౌరవం, సంపద, అధికారం, అన్నీ వారిహస్తగతంచేసి భావదాస్యాన్ని జాతికి నూరిపోసిన మహత్తర గ్రంథంగా మనుస్మృతి మనకుకనిపిస్తుంది.

అయితే ఇప్పుడు మనుస్మృతి అమలులో లేదుగదా? అని కొందరు అనవచ్చు. కానిజాతి నరనరాల్లో మనుస్మృతి బోధలు ప్రసరిస్తూనే ఉన్నాయి. ఈనాటికీ ఆచార, కర్మకాండలు మాసిపోలేదు.

ఎంతో కాలంగా జాతిజీవనాన్ని కలుషితంచేసి, జాతి శౌర్యాన్ని, శీలాన్ని హరించి నిర్వీర్యం చేసిన మనుస్మృతిని 'అంబేడ్కర్' వంటి సాంఘిక విప్లవ కారులు తగులబెట్టారు అదిచాలదు. జాతిమొత్తం ఒక్కసారిగామండి ఆగుండెపొరల్లోనుండి పెల్లుబికిన జ్వాలనజ్వాలల్లో దీన్నితగులబెట్టాలి. అప్పుడుగాని గతస్మృతి, మనుస్మృతి దివాంధరుతి తొలగబడిపోదు. అప్పుడుగాని జాతిజీవనంలో నవశకం ఉద్భవిల్లదు. అప్పుడుగాని నవ పరంపర పెల్లుబుకదు.

మనుషులంతా ఒక్కటే - మనిషికి నేడు పూసినకులం జాతి పుట్టుకతో వచ్చిందికాదు. ఇది ఋగ్వేదంలోపుట్టి మనువుచేత పెంచి పోషింపబడింది. కొంతమంది స్వార్థంకోసం పుట్టి పెరిగిన ఈ విష వృక్షాన్ని కూకటి(వేళ్ళతో పెళ్ళగించాల్సిన అవసరం ఎంతైనాఉంది.

మనుష్యుల భావాల్లో అంతర్లీనమైన విషాన్ని భావవిప్లవం ద్వారా పిండాలి. సామాజిక దౌష్ట్యానికి, అస్తవ్యస్తతకు మూల కంటమైన ఈ కులాన్ని సామాజిక విప్లవం ద్వారా సాధించాలి. కర్మ పేరుతో ఒక మనిషిని మరోమనిషి దోచుకునే ఈ మతాన్ని ఆర్థిక పోరాటంద్వారా జయించాలి. రాజకీయ అధికారంతో కులం బురదను ప్రాసి ఆర్థిక అస్తవ్యస్తతనుస్థాపించి మనిషికి మనిషికిమధ్య ఉక్కుగోడలు కట్టిన ఈ పురాతన భావాల ఉక్కు సౌధాలను ముక్కలు గొట్టాలంటే కులం పేరుతో సాంఘికంగా, రాజకీయంగా అణగ(దొక్కబడిన మనిషి రాజకీయ అధికారాన్ని కూడా చేపట్టగలగాలి.

కన్ని ఉద్యమాలు పరస్పర సంబంధితాలై పోరాడినపుడు మాత్రమే నవసమాజస్థాపన నవరాజ్య నిర్మాణం జరుగుతుంది. లేనంత కాలం ఈ మనుస్మృతి భారతీయ మన స్తత్వం మీద పెత్తనం చేయక మానదు.

మతనియంతృత్వం క్రింద
దైవ భావ నియంతృత్వంక్రింద
రాజకీయ (ప్రజాస్వామ్యంపేరుతో)
నియంతృత్వంక్రింద
కులభావనియంతృత్వంక్రింద

అణగిమణగి పోయిన మనిషిలో చైతన్యం రగల్చాలంటే సామాజిక, ఆర్థిక న్యాయంకోసం పోరాడటానికి మనిషిని సమాయత్తం చేయాలంటే.

కులం పునాదుల్ని పెకలించాలి;
కులం రంగుని తుడిచివెయ్యాలి.

# పు రా ణ ము లు

## పురాణమంటే ఏమిటి! ఎన్ని!

'యస్మాత్ పురాహి అనతి ఇదంపురాణ' మ్మనివాయు పురాణమున పురాణశబ్దము నిర్వచింపబడినది. (అధ్యా 1_203) అతిప్రాచీన కాలమునుండి జీవించుచూ వచ్చుచున్నది కనుక దీనికి పురాణమని పేరు వచ్చినది. లిఖితసాహిత్యము రాకపూర్వమే ఈ పురాణశబ్దము వాఙ్మయములో ఉన్నదని దీనివలన తెలియుచున్నది.

"ప్రథమం సర్వశాస్త్రాణాం పురాణం బ్రహ్మణస్మృతం
అనంతరం చవక్త్రేభ్యో వేదాస్తస్యవినిస్సృతాః" (1-60)

అను వాయుపురాణ శ్లోకమునుబట్టి బ్రహ్మచే ప్రప్రథమమున పురాణము స్మరింపబడినదనియు, పిమ్మట అతని ముఖములనుండి వేదములు వెలువడెననియు, చెప్పుచున్నది. వేదములందలి ఋక్కులు, బ్రాహ్మణములందలి కథేతిహాసములును పురాణములకు వస్తువులు.

బ్రహ్మ ముఖమునుండి పుట్టినగాని దేనికైన సార్థకత లభించదని తలంచారు కాబోలు. బ్రాహ్మణులు, వేదాలు, పురాణాలు, అన్నీ బ్రహ్మ ముఖమునుండే పుట్టినవని వాళ్ళన్నారు.

విష్ణుపురాణమున పురాణోత్పత్తికి సంబంధించిన శ్లోకాలనుబట్టి వ్యాసుడు పురాణ సంహితనుగూర్చి తన శిష్యుడైన రోమహర్షణునికి బోధించెననియు, రోమహర్షణుడు దానిని అగ్నివర్చుడు, మైత్రేయుడు శాంశపాయనుడు, కాశ్యపుడు, సావర్ణి, అకృతవ్రణుడు మున్నగు తన శిష్యులకు ఉపదేశించెననియు రాజులు యజ్ఞములొనరించు సమయమున వారు దానిని సభాసదులకు వినిపించు చుండిరనియు తెలియుచున్నది.

దీనినిబట్టి వైదికమతం బ్రాహ్మణమతంగా పరిణమిల్లి కర్మకాండకు అత్యంత ప్రాధాన్య మివ్వబడిన తరువాత ఆ కర్మకాండకు అర్హులైన ద్విజులు తమ ఆధిక్యమును ప్రకటించుకొనుటకు ఈపురాణాలు కథాకథన చాతురితో వినిపించి, కర్మకాండపేరుతో జరుగుతున్న దోపిడికి శాస్త్రీయ భావమును కల్పించినట్లుగా తెలియుచున్నది.

**పురాణాలు** :— సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశానుచరితము, అను పంచలక్షణములతో నుండి, హిందూ తత్వ సారము నెరుగుటకు, వర్ణాశ్రమధర్మములను ప్రవచించుటకు, బ్రాహ్మణుని గొప్పతనము నుగ్గడించుటకు ఇవి ఉపకరించినవి.

భద్వయం మద్వయం చైవ బ్రత్రయం వచతుష్టయం
అనాపలింగ కూస్కాని పురాణాని ప్రచక్షతే.

అనుశ్లోకమునుబట్టి పురాణాలు పదునెనిమిది.

భద్వయం = భాగవతము
భవిష్యపురాణము
మద్వయం = మత్స్యపురాణము
మార్కండేయ పురాణము
బ్రత్రయం = బ్రహ్మపురాణము
బ్రహ్మవైవర్తక పురాణము
బ్రహ్మాండ పురాణము
వచతుష్టయం = వరాహ పురాణము
విష్ణు పురాణం
వామన పురాణం
వాయు పురాణం
అ = అగ్ని పురాణము
నా = నారద పురాణము

ప = పద్మ పురాణం
లిం = లింగపురాణం
గ = గరుడ పురాణం
కూ = కూర్మ పురాణం
స్కా = స్కాంద పురాణం

ఇవి పదునెనిమిది పురాణాలు.

## ఉప పురాణములు

సనత్కుమార, సూతసంహిత, నారసింహ, నారద, శైవ దుర్వాస, కాపిల, మానవ, ఔశన, వారుణ, కలి, సాంబ, సౌర, పారాశర్య, ఆదిత్య, మాహేశ్వర, భాగవత, వాశిష్ఠము. ఇవి పదునెనిమిది.

గణేశ, మౌద్గల, కాశీ, కల్కి, మొదలగు ఉపోప పురాణాలు ఇంకా ఎన్నియో కలవు.

"భారతః పంచమో వేదః" అని చెప్పబడినను ఇది పురాణము లలోనే చేరుచున్నది. ఈ పురాణము లన్నింటిలోను కులధర్మములు, అగ్రకులముల ఆధిక్యము ఉన్నది. ఐతే వీటన్నింటిని ఉదాహరించవలె నన్న ఈ భాగమే ఒక గ్రంథమగును. అందువలన మచ్చుకు కొన్ని ఉదాహరణములతో ఈపురాణాలు కులములను ఎట్లు ప్రచారం చేసినవో పరిశీలింతము.

# పురాణాలు – కులం

హిందూ పురాణాలు శైలీ రమ్యములు, కథాకథన చాతుర్యములు, పాత్రపోషణా భాసురములు, అందుననే అవి భారతీయుల

హృదయ ఫలకముల చిత్రించబడినవి. ఈ కవులు వర్ణతత్వాన్ని కర్ణ పేయంగా వినిపించారు. అతిసామాన్యుడికికూడ కులధర్మాలను బోధించటానికి సాధనాలుగా ఈ పురాణాలు ఉపకరించినవి. ఈ పురాణాలే తరువాత ప్రబంధాలు, కావ్యాలు, యక్షగానాలు, జముకులకథలు, నాటకాలుగా విస్తరిల్లి కులతత్వాన్ని అత్యంత రమణీయంగా ప్రచారం గావించినవి.

## భారతము - కులము

బ్రాహ్మణోత్కర్షము

వ్యాసభారతమునందు బ్రాహ్మణ తత్వముబాగా పోషించబడినది. సమయం దొరికినప్పుడెల్ల బ్రాహ్మణోత్కర్షను పొగడుచునే యున్నాడు. నన్నయ వ్యాసుని మించిపోయాడు. పంచమ వేదమని ప్రశస్తికెక్కిన భారతము కులతత్వ వేదంగా రూపొందింది. క్రీ॥ పూ॥ 1, 2 శతాబ్దాల కాలంలో వ్రాయబడిన సంస్కృత భారతానికి క్రీ॥ శ॥ 11వ శతాబ్దిలో వ్రాయబడిన తెలుగు భారతం బ్రాహ్మణుల్ని పొగడటంలో ఏమీ తీసి పోలేదంటే 1000 సంవత్సరాల్లో మన సామాజిక వ్యవస్థలో ఏమీ మార్పురాలేదనే విషయం అర్థమవుతున్నది.

సంస్కృత భారతమున (ఆది పౌలోమపర్వమునందు) సప్తమాధ్యాయమున భృగుమహర్షి అగ్నిని శపించగా అగ్ని నొచ్చుకొని భృగునితో ఇట్లు అనెను.

"శక్తోఽహమపి శప్తుం త్వాం మన్యాస్తు బ్రాహ్మణాపమ
జానతోఽపి చతే బ్రహ్మనా కథయిష్యతే నిబోధతత్"

నన్నయ ఆదిపర్వము ప్రథమాశ్వాసమున అగ్నితో ఇట్లనిపించెను.

"అడిచినఁదిట్టినన్ మరి మహాపరుషంబులు పల్కినుల్కతో
బొడిచిన నుత్తమద్విజులు పూజ్యులు; వారలకెగ్గు సేసినం
జెడునిహముం బరంబు నిది సిద్ధముగావు పెఱింగి భక్తినె
ప్పుడు ధరణీసురోత్తములఁ బూజలఁదన్పుదు నల్గనోడుదున్."

సహస్రపాదుడు రురునితో అన్న మాటలుగా అదేపర్వమున ఏక
దశాధ్యాయములో నిట్లున్నది.

'ఇదంహోవాచ వచనం రురుమప్రతిమౌజనమ్।
అహింసాపరమోధర్మః సర్వప్రాణభృతాంవర॥
తస్మాత్ప్రాణభృతస్సర్వాన్ నహింస్యాత్
బ్రాహ్మణం క్వచిత్
బ్రాహ్మణస్సౌమ్య ఏవేహ భవతీతి పరాశ్రుతి॥
వేద వేదాంగ విన్నామ సర్వభూతా భయప్రదః।
అహింసా సత్యవచనంక్షమాచేతి వినిశ్చితమ్॥
బ్రహ్మణస్య పరోధర్మో వేదానాం ధారణాపిచ॥
క్షత్రియస్య హియోధర్మః సహినేష్యేత వైతవ॥

నన్నయ భారతమున.

'భూనుతకీర్తి బ్రాహ్మణుడు పుట్టిన తోడన పుట్టునుత్తమ
జ్ఞానము సర్వభూతహిత సంహిత బుద్ధియుఁజిత్తశాంతియున్
మానమదప్రహాణము సమత్వము సంతతవేద విద్యను
ష్ఠానము సత్యవాక్యముదృఢ వ్రతమున్ గరుణాపరత్వమున్॥

"......బ్రాహ్మణుల హింసాపకలాపులుసేయు హింసలు
వారించు కరుణామూర్తులు"

గరుడుడు అమృతం తెచ్చుటకేగునప్పుడు జననియైన వినతతో
నాకాహారమును ప్రసాదింపుమనెను.

తల్లి సముద్రమున అసంఖ్యాకమైన నిషాదగణమున్నది. భక్షించి చనుము

"భక్షణ విషయంబున బ్రాహ్మణునింబరిహరించునది యనిన గరుడుండు నాకు బ్రాహ్మణునెఱుంగు తెఱంగెఱింగింపుమనిన వినత యిట్లనియె. బ్రాహ్మణుడు మింగునప్పుడు కంఠబిలమున జొరంబడిక అగ్నివలె వ్రేల్చుచుండును.

రయమున మ్రింగుడు గాలము
క్రియనెవ్వడు కంఠబిలము క్రిందికిఁజనక
గ్నియ పోలెనేర్చుచుండును
భయరహితావాని నెఱుగు బ్రాహ్మణకులుఁగాన్

ఇంకా ఎట్టివాడనిన

కోపితుండైన విప్రుడు ఘోరశస్త్ర
మగు మహావిషమగు నగ్నియగు నతండ
యర్చితుండైన జనులకు నభిమతార్థ
సిద్ధికరుఁడగు గురుడగుఁ జేయుప్రీతి.

"విప్రునికి కోపము తెప్పించిన, శస్త్రమై, విషమై, అగ్నియై, కోపము కలిగించినవానిని నాశనముచేయును. అతణ్ణి పూజించినట్లైతే గురుడై ప్రీతితో కోరుకున్న ఫలముల నొసగును" అని చెప్పుచున్నది.

భారతదేశంలో మాతలు పెక్కురు బిడ్డలకు ఇలాంటి విషపూరిత భావాలనే నూరిపోస్తున్నారు. బ్రాహ్మణవర్గం మీద గౌరవాన్ని పెంచే ఇలాంటి కథలెన్నో పురాణాల్లో లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి.

గొంతుక చొచ్చిన విప్రునితో గరుడుడు ఏమనుచున్నాడో చూడండి.

ద్విజోత్తమ వినిర్గచ్ఛ తూర్ణమాస్యాద పావృతాత్
నహిమే బ్రాహ్మణోవధ్యః పాపేష్వపిరతస్సదా॥

తెలుగుభారతంలో

విప్రులబొందియున్న నపవిత్రులు పూజ్యులుగారె, కావునన్
విప్రకులుండ వెల్పడుము వేగమనీవును నీ నిషాదియున్

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి వంటి పెద్దలు "ఈ బ్రాహ్మణ ప్రశంస వచనముల వ్యాసభారతములోని వేగాని నన్నయస్వాతిశయముతో తెచ్చిపెట్టినవిగావు" (సారమతినన్నయ 20 వ పేజి) అనుచున్నారు.

కాని నన్నయ తనకుతానుగా వ్రాసిన ఆంధ్రభారతం పీఠికలో బ్రాహ్మణతత్వాన్ని నింపి వేశాడుకదా !

రాజరాజునుగూర్చి సంబోధిస్తూ

సమస్తవర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిమన్ — అవతారిక

"విప్రకులమునెల్లఁ బ్రోచుచు"

"అగ్రజన్ములకు ననుగ్రహమునఁ జారుతర
మహాగ్రహారములిచ్చుచు"

"మనుమార్గుడగు విష్ణువర్ధనుండు"

మనుస్మృతి ధర్మముల నాచరించువాడై వర్ణాశ్రమ ధర్మములను రాజ్యమున నెలకొలిపి విప్రకులమునెల్ల బ్రోచుచు సుందరమైన మహాగ్రహారములు బ్రాహ్మణులకిచ్చుచు రాజరాజ నరేంద్రుడు రాజ్యమును పరిపాలించుచున్నాడని చెప్పుచున్నాడు.

ఈ విషయమును రాజరాజుతో కూడ ఒప్పించుచున్నాడు.

'ఇవియేనున్ సతతంబు నాయెడఁగరంబిష్టంబులై యుండుఁబా
యవుభూదేవకులాభి తర్పణ మహీయః ప్రీతియున్'

(అవతారిక 12)

ఈ దానాదులన్నింటికంటే సువర్ణ శృంగఖురమైన గోదానం గొప్పది. ఆ దానాలతో సమాన మంటున్నాడు భారత శ్రవణం.

సృష్టిలోఉన్న సర్వవస్తువులు బ్రాహ్మణునికి దానంగా చెప్పారు. ఈ దానాదులన్నింటిని పురాణాల్లో వివిధ కథల్తో ప్రచారంచేసి బ్రాహ్మణ భక్తిని పెంచడానికి ప్రయత్నించారు. బ్రాహ్మణోత్కర్షను ప్రచారం చేయడానికి కంకణం కట్టుకున్నవారిలో నన్నయకూడా ఒకడని మనకు పైఉదాహరణల వలన అర్థమగుచున్నది.

రాజధర్మము—దండనీతి

రాజులు బ్రాహ్మణుల కగ్రహారములిచ్చుట బ్రాహ్మణులు రాజధర్మమునకు దండనీతికి అత్యంత ప్రాధాన్యమిచ్చి పురాణములలో అధ్యాయములు వ్రాసి ప్రజలను రాజు చెప్పుచేతల్లోనుండునట్లు చేసెను. భారతము శాంతిపర్వము 63 వ అధ్యాయమున ఇట్లుగలదు.

"యథారాజాన్ హస్తి పదేపదాని సంలీయంతే
సర్వసత్వోద్భవాని
సర్వాపిద్యా రాజధర్మేషు యుక్తాః సర్వేలోకా
రాజధర్మే ప్రవిష్టాః"

ఏనుగుయొక్క అడుగునందు తక్కిన అన్నిజంతువుల పాదములు ఇమిడిపోయినట్లు రాజధర్మమందు సమస్తధర్మములు ఒదిగిపోవుచున్నవి.

క్షాత్రధర్మమునకు శత్రువులైనవారిని దండించుటను గూర్చి భారతంలో పెక్కుచోట్ల చెప్పబడినది.

ఆనాడు క్షాత్రధర్మములలో ప్రధానమైనది వర్ణధర్మమును కాపాడుటయేగదా!

భారతం శాంతిపర్వం 64 వ అధ్యాయములో ఇట్లా అంటు న్నాడు చూడండి.

అను సీస పద్యముతో ప్రారంభించి చతుర్వేదములును క్రమముగానిట్లు పల్కెనని ఈ సీసము వ్రాసెను.

సీ॥ బ్రాహ్మణజాతికి పరిభవంబొనరింప
మున్ను చేసిన పుణ్యములు నశించు
జపహోమ ముఖకర్మ సంచయంబునకధి
కతరంబు విప్రముఖమున నిడుట
భూసురార్చనమొక మాసంబు సల్పిన
పాపంబులెప్పుడు పాసిపోవు
నగ్రవర్ణులగాంచి యాదరింపకయుండు
కంటెను గీడొండు కలుగదరయ
ననిక్రమంబున ఋగ్వేదమును యజస్సు
సామమునథర్వణంబు సారభూత
భవ్య సంభాషణము నేత దివ్యమునుల
వలన విందుము కౌరవకుల పవిత్ర.

మరల ద్వితీయాశ్వాసమున దానపాత్రులను గూర్చి చెప్పెను భీష్ముఁడు
యోగ్యుడై విప్రుడొకరుండు సంతృప్తి
బొంద నధిక తృప్తిబొందుదేవ
వితతి మునిసమూహ పితృసమాజములన
ట్లగుట వెదకితెచ్చునది విశిష్టు" అని పలికెను.

ఇంకను వాసుదేవ నారద సంవాదమును గురించి తెలుపుచూ భీష్ముఁడు ...... సామ్రాజ్యాభిషిక్తుడయిన నృపతికిన్ విను కర్తవ్య తమంబగుపని బ్రాహ్మణపూజనంబు భవ్యవిచారా! అని ప్రారంభించి ఆరు కందపద్యములలో బ్రాహ్మణోత్కర్షను నింపెను.

మరియు పృథివి వాసుదేవునకు చెప్పినట్లుగా
అనిన పృథివి ఇట్లులను విప్రసేవను
విప్రపూజనమున విప్రహితవి
ధానమునను పాప తతినోర్చు మానవ
ప్రతతియెందునివి నృపాలుపనులు"

అను మున్నగు నాలుగు పద్యములలో అదేవిషయమును జెప్పెను. అందు

"జననంబున విప్రునధిప మహాభాగునిగా
జెప్పుదురార్యులు జనులకు వంద్యంబు లతని
చరణాంబుజముల్".

బ్రాహ్మణ్యంబెల్ల వర్ణంబులకు దారకంబు అనువచనంబుతో ప్రారంభించి ఆరు పద్యవచనములలో ఆ విషయమునే విపులీకరించెను. ఆనుశాసనిక పర్వమున దానధర్మ అంతఃపర్వమున 8, 31, 33, 34, 35, 36, 151, 159, అధ్యాయములు చూడుము.

(సారమతి నన్నయ్య. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి)

ఎఱ్ఱన హరివంశములో (క్రీ॥శ 1325-1335 మధ్య వ్రాయబడినది.)

వేదవ్యాస మునీంద్రుడు జనమేజయునకు కలియుగ ధర్మంబు నెరిగిస్తూ

'వర్ణములు నాశ్రమంబులు వసుమతీశ
కలియుగంబున గత్తరిగలసిపోవు
గానధర్మంబు రూపయి కానరాదొ
కింత గలిగినది ఫలంబెక్కుడించు"

(9 ఆశ్వాసం - పద్యం-37)

కలియుగములో వర్ణములు సంకరమైపోవునని సంస్కృతి మాల ములో వ్యాసుడు వాపోవుచున్నాడు. వర్ణములు ఆశ్రమములు కలసి పోయి ధర్మం నశిస్తుందంటున్నాడు. అంటే వర్ణాశ్రమ ఉత్కృష్టధర్మాన్ని చెసగకుండ చూడటమే రాజుపని అని బోధిస్తున్నాడు.

"కులములు నెడి యన్యులు ప్రబలి జగము శిధిలతఁబొందున్"

(9 - 46)

ఇది ఈ దేశానికేనా? అన్ని దేశాలకా!

కులములు సంకరమైతే జగమే శిధిలమై పోతుందని చెప్తు చున్నాడు.

"మలినములై శరీరముల మంగళతం
గులగోత్రచిహ్నముల్
దొలగగ నల్పసంతతులతో
బరమాయువు ముప్పదేండ్లయై"

కులము గోత్రాలకున్న చిహ్నములు తొలగిపోతే అల్పాయుష్కులగుదురట!

కులానికి కులానికి వేషంలో భాషలో ఆభరణాల్లో అన్నింటిలో ప్రత్యేకత ప్రత్యేకవిధానం అలవర్చడంతో ఒకజాతిలోవున్న జనం విభిన్న జాతులవలె మనకు కనిపిస్తున్నారు. మనిషినిచూచి కులంచెప్ప వచ్చు అంతగా కులానికి, కులానికి విభిన్న సంస్కృతులు ఏర్పరచి-కుల సంస్కృతులను పెంచి పోషించారు అవి తప్పకూడదని ఇట్లా పురాణాల్లో కళాత్మకముగా వినిపించి సామాన్యుణ్ణి కర్మబద్ధుణ్ణి చేస్తున్నారు.

"రాహుకబళంబునను హిమరశ్మిపోలుపు
వెలయకడిగిన మాడ్కి నక్కలియుగమున
నొయ్యనడగు ధర్మము''     (ఆ 9-67 ప)

కలియుగములో ధర్మం అణిగిపోతుంది-అణిగిపోతుంది అంటున్న యీ రచయిత ఏయుగంలో ఉండి వ్రాస్తున్నాడో–ఇంతకంటేముందు యుగాలుఉన్నట్టు ఈ ధర్మాలు అప్పటిజనులు తూచ తప్పకుండ ఆచరించి స్వర్గమును సుఖములను పొందినట్లు ఈ యుగములో ధర్మము భ్రష్టమగుచున్నట్లు చెప్పి జనాన్ని మోసగిస్తున్నాడు. ఈ పురాణాల అబద్ధప్రచారాల వల్లనే శాస్త్రీయ విజ్ఞానం ఇంత దూసుకుపోతున్నా సామాన్యుడు దానిని గ్రహించలేక మానవ పరిణామాన్ని - విశ్వ పరిణామాన్ని తెలిసికొనలేక - ఈ చెత్తభావాల కసరత్తులో ఇరుక్కుపోతున్నాడు.

గానే మిగిలిపోవడం తథ్యం. దాదాపు పదిహేనువందల సంవత్సరాలు పాటు మన మానసికవికాసానికి మన సాంఘిక పురోగతికి రామాయణ భారతాల ప్రభావం అష్టాదశ పురాణాల ప్రభావం ఒక తీవ్ర ప్రతిబంధకంగా నిలిచింది. ఆ ప్రతిబంధకాన్ని ఇకనైన తొలగించుకొనక పోతే మనం ఆధునిక యుగాల్లో ప్రవేశించలేము. అభ్యుదయపథం వెంట పురోగమించలేము."

అయితే మనం ఒకటి గమనించాలి జన్మనిబట్టి కులం అని సమర్థించేసూత్రాలు ఇంతవిరివిగా ప్రకటించి ప్రజలు వాటిననుసరించేటట్లు చేసినా గుణాన్నిబట్టి వర్ణం జన్మనిబట్టికాదు అని మరియొక ప్రక్క ప్రచారం చేశారు. ఈ విషయంమీదకూడా విరివిగానే వ్రాశారు. కులంకాదు ముఖ్యం గుణం అన్నారు. గుణాన్నిబట్టే బ్రాహ్మణత్వమొస్తుందన్నారు. ఇది పెద్ద కుట్రఅని వేరుగా చెప్పవలసిన పనిలేదు. వర్ణంమీద ఎదురుతిరిగి తమగొప్పతనాన్ని ప్రతిభనుబట్టి నిరూపించుకొన్న కొందరు ఋషుల నడ్డంబెట్టుకొని గుణాన్నిబట్టి యే వర్ణం అని వీళ్ళు ప్రచారం చేశారు. శ్రీకృష్ణుడు గుణాన్నిబట్టి నాలుగు వర్ణాలుగా జనాన్ని విభజిస్తే, కర్ణుని గుణాన్నిబట్టి అగ్రవర్ణాలలో చేర్చకుండ ఎందుకు సూతకులజుడుగా భావించాడు. ఇదంతా కుతంత్రముతో కూడుకొన్న ప్రచారం. మనపురాణాలు ఉపనిషత్తులు ఈ విషయాన్ని ఎట్లాప్రచారం చేశారో పరిశీలిద్దాం.

శ్లో॥ శ్రుణు యక్ష! కులంతాత! నస్వాధ్యా యో నచశ్రుతమ్
కారణం వా ద్విజత్వే చ వృత్తమేవ నసంశయః
[భార. అర. 3 1 2106]

---

(సీతజోస్యం) - నార్ల వెంకటేశ్వరరావు - ఉపసంహారణ. పేజీ నెం. 131

శ్లో॥ భక్తి రష్టవిధా హ్యేషా యస్మిన్ మ్లేచ్ఛేఽపి వర్తతే
స విప్ర ఇంద్రో మునిమాన్ స యతి స్సచ పండితః,
తస్మై దేయం తతో గ్రాహ్యం స చ పూజ్యో యథాహ్యాహమ్.
(వరాహపురాణము)

భక్తి ఎనిమిది విధములు అది మ్లేచ్ఛుని యందున్నను ఓ విప్రుడా! ఆతడే మహర్షి యతియు, పండితుడును. ఆతనికి దాన మివ్వవచ్చును. ఆతనినుండి ప్రతిగ్రహింపవచ్చును, నావలె ఆతడును పూజ్యుడు.

శ్లో॥ ఏభిస్తు కర్మభిర్దేవిః శుభై రాచరితై స్తథా
శూద్రో బ్రాహ్మణతాం యాతి వైశ్యః క్షత్రియతాం వ్రజేత్
న యోని ర్వాపి సంస్కారో న శ్రుతం నచ సంతతిః
కారణాని ద్విజత్వస్య వృత్తమేవ తు కారణమ్
సర్వోఽయం బ్రాహ్మణో లోకేవృత్తేన చ విధీయతే
వృత్తిస్థితస్తు శూద్రోఽపి బ్రాహ్మణత్వం నియచ్ఛతి
(భార. అనుశాసనము)

దేవీ ! పవిత్రాచరణగల ఈ కర్మలచేత శూద్రుడు బ్రాహ్మణత్వమును పొందును. వైశ్యుడు క్షత్రియత్వమును పొందును. ద్విజత్వమును పొందుటకై జన్మముకాని, సంస్కారముకాని పాండిత్యము కాని, సంతానముకాని కారణములు కావు. వృత్తియే కారణము. లోకమందు బ్రాహ్మణ్యము వృత్తముచేతనే విధింపబడుచున్నది. సద్వృత్తమందున్న శూద్రుడుకూడ బ్రాహ్మణత్వమును పొందును.

శ్లో నకులేన నజాత్యావాక్రియయా బ్రాహ్మణో భవేత్
చండాలోఽపిహి వృత్తస్థో బ్రాహ్మణస్య యుధిష్ఠిర!
ఏకవర్ణ మిదం పూర్ణం విశ్వమాసీ ద్యుధిష్ఠిర!
కర్మక్రియా విశేషణ చాతుర్వర్ణ్యం ప్రతిష్ఠితమ్

బ్రాహ్మణుల యందు కాన్పించదు. శూద్రుడు శూద్రుడు కాక పోవచ్చును. బ్రాహ్మణుడు బ్రాహ్మణుడు కాకపోవచ్చును.

కోవా బ్రాహ్మణో నామ యః కశ్చిదాత్మనా మద్వితీయమ్ జాతి గుణక్రియాహీనం షడూర్మిషడ్భావేత్యాది సర్వదోషరహితమ్ సత్యజ్ఞానానందానంత స్వరూపం స్వయం నిర్వికల్పమశేష భూతాంతర్యామి త్వేనవర్తమాన మంతర్బహిశ్చాకాశ వదనుస్యూత మఖండానంద స్వభావ మప్రమేయమను భవైక వేద్యమ పరోక్షతయా భాసమానం కరతలామల కవత్సాక్షాద పరోక్షీ కృత్యకృతార్థతయా కామరాగాది దోషరహిత శమాది సంపన్నా భావమాత్సర్య తృష్ణాశా మోహాది రహితదంభాహంకారాదిభి రసంస్పృష్టచేతా వర్తతేఏవం లక్షణో యస్సఏవ బ్రాహ్మణఇతి శ్రుతిస్మృతి పురాణేతిహాసానామభిప్రాయః అన్యథా బ్రాహ్మణత్వ సిద్ధిః నాస్త్యేవ సచ్చిదానంద మాత్మాన మద్వితీయం బ్రహ్మభావయేత్.

(వజ్రసూచికోపనిషత్తు)

తర్హి జాతిర్బ్రాహ్మణ ఇతి చేత్తన్న, తత్రజాత్యన్తరేష్వనేకః జాతిసంభవాత్ మహర్షయో బహవస్సన్తి, ఋష్యశృంగో మృగ్యాః, కౌశికః కుశాత్, జంబూకోజంబుకాత్, వాల్మీకో వల్మీకాత్, వ్యాసః కైవర్తకన్యాయాం, శశపృష్ఠాద్గౌతమః, వశిష్ఠ ఊర్వశ్యాం, అగస్త్యః కలశేజాత ఇతిశ్రుతత్వాత్, ఏతేషాం జాత్యావినాప్యగ్రే జ్ఞాన ప్రతిపాదితా ఋషయో బహవస్సన్తి. తస్మాన్న జాతి ర్బ్రాహ్మణ ఇతి.

(వజ్రసూచికోపనిషత్తు)

బ్రాహ్మణుడనగా నెవడు, ఎవడు ఆత్మలలో సాటిలేనట్టియు, గుణక్రియాదులు లేనట్టియు, దోషరహితమైనట్టియు సత్యజ్ఞాన ఆనందములుకలిగి, అత్యంతమైన స్వరూపములు కలిగినట్టియు, వికల్పరహిత

ఒక్కడు! ఒక్కడు! ఒక్కడేనియు కానరాడు. జంధ్యము వేసుకొని, పేరుకుచివర శాస్త్రి తగిలించుకున్న మాత్రమున బ్రాహ్మణుడు కాడని పైమాటలు చాటిచెపుతున్నవి.

నచర్మణో నరక్తస్య నమాంసస్య నచాస్థినః
నజాతిరాత్మనో జాతిర్వ్యవహారేణ కల్పితా!

(నిరాలంబోపనిషత్తు)

చర్మమునకుగాని, రక్తమాంసములకుగాని, ఎముకలకుగాని, ఆత్మకుగాని, జాతియన్నదిలేదు. ఈజాతియన్నది వ్యవహారమున వచ్చినది.

మరి ఈసూక్తులు వల్లెవేస్తున్న ఈ ధర్మగ్రంథాలు అంటరాని తనాన్ని ఎలాసృష్టించినయ్? మనిషిని అంటుకుంటేనే కాదు, మాట వింటేనేమైల బడిపోతావని ఎట్లుచెప్పినయ్?

అందుకే మనము గమనించవలసిన విషయము ఒకటుంది. ఈ గ్రంథాలు రెండునాలుకలుగల నాగుబాములు. ధర్మాన్ని, అధర్మాన్ని, ఒకేచోటచెప్పి అవసరమైనప్పుడు తప్పుకుంటాయి. వీటిని ఖండించడానికి వచ్చిన సిద్ధాంతాలమీద ధ్వజమెత్తి మీరుచెప్పేసూత్రాలు మాలోనే ఉన్నాయి అనిబుజువు చేస్తాయి.

ఈ సూక్తుల అస్త్రాలతోనే వీళ్ళు వారిమీద తిరుగుబాటుచేసిన ఉద్యమాలతో పోరాడి సమర్థించుకోగల్గారు, ఆచరణలో కులానికి ప్రాధాన్యమిస్తూ, ప్రచారములోమాత్రం గుణానికి ప్రాధాన్యమిస్తున్న ఈ మతాన్ని నాశనం చేస్తేకాని కులంపోదు.

# వేమన్న – కులపోరాటం

కులతత్వాన్ని నిరసించి, కులధర్మాన్ని దుయ్యబట్టి, కులం పునాదుల్ని కదిలించి, కులం దోపిడిని ఎదిరించి, కులం కుళ్ళును కెళ్ళగించి, కులం రొంపిని ఎండకట్ట సమకట్టిన మొదటి విప్లవ ప్రజాకవి వేమన.

సమకాలీన సమాజంలో కవులు అష్టాదశవర్ణనలతో, అంగనల అంగాంగ వర్ణనాభిలాషతో, శృంగారరంగస్థలంపై శ్లేషయమకాల గారడీలు చేస్తున్నప్పుడు సమాజగర్భంలోకి చొచ్చుకుపోయి సమకాలీన సామాజిక హృదయానికి అద్దంపట్టిన గుండెగల కవి వేమన. ప్రజల భాషలో సామాన్యుల ఊసులు ఆటవెలదుల్లో మూసపోసిన, అత్యాధునిక అమృతకవి వేమన. దేవుళ్ళకు మతాలకు, కులాలకు, ఆచారాలకు, సంప్రదాయాలకు, కొమ్ముగాస్తూ తమ కవితాసంపత్తిని వాటి ఉనికికి ధారవోస్తున్న మతభజంత్రీ కవులను, రాజభజంత్రీ కవులను నిరసించి, ప్రజాసమస్యలకు పతాకమెత్తిన కవి. కలాలు, గళాలు, రాజులకు, రాళ్ళకు అమ్ముకొన్న కవిమూర్ధన్యుల తలలుతన్ని మానవధర్మానికి, మానవతోద్యమానికి, గుండెలర్పించిన గండర గండడు వేమన.

అందుకే "తెలుఁగు సాహిత్యంలో ఈ కవి స్థానము గ్రీకు సాహిత్యములో లూషియస్ స్థానము వంటిది."[1] కవి, దార్శనికుడు, ప్రవక్తయై, అనేక విషయములలో విశిష్టస్థానము నాక్రమించుకొనిన వేమన సర్వకాలికమైన ప్రబోధసందేశమును సమస్త జాతులకు ఒసంగ గలిగియున్నాడు. "ఆయన మతము మానవమతము. ఆయన ధర్మము ప్రేమవ్యాపకము. సర్వమానవ సౌహార్ధము. భిన్నభావ సమన్వయము.

---

1. వేమన పాశ్చాత్యులు – చార్లెస్ ఫిలిప్ బ్రౌను.
(నేను వేమనను కనుగొంటిని.)

కులమత వర్ణవ్యవస్థలచే చిన్నాభిన్నము కాని, సార్వజనీన సౌభ్రాతృత్వమును స్థాపించుటే ఆయన పరమలక్ష్యము."[2]

కులముహెచ్చు తగ్గు గొడవలు పనిలేదు
సానుజాతమయ్యె సకల కులము
హెచ్చుతగ్గుమాట లెన్నెరుంగగవచ్చు.

అన్ని కులాలు మానవసంఘం నుండే వచ్చినవి. కులం పేరుతో హెచ్చుతగ్గులను కల్పించి, సమాజైక్యతను ముక్కలు చేయుచున్న కులపెద్దలను నిలదీసి కులం పేరుతో హెచ్చుతగ్గులును ఎలా నిర్ణయించ గలరని ప్రశ్నిస్తున్నాడు.

హిందూమతానికి సృష్టి స్థితి లయ కర్తలైన దేవుళ్ళ కులాలను నిలదీసి అడుగుచున్నాడు.

బ్రహ్మ యెవనికొడుకు పరికింపగా భువి
విష్ణువెవని కొడుకు వెలయజూడ
శివుడు యెవనికొడుకు సిగ్గెరుగరు జనుల్

'కులముకన్న మిగుల గుణము ప్రధానంబు' అని ఎఱుకగలవాడె హెచ్చయిన కులజుండు' అని కులంపేరుతో దోచుకుంటున్న బ్రాహ్మణులకు దానాలు, సంతర్పణలు ఇచ్చినందువలన పుణ్యమెట్లు కలుగుతుంది. జీవుళ్ళందరిలో ఒకే ఆత్మకదా ఉండేది. కుక్కలకు పెట్టిన విశ్వాసమైన ఉంటుంది అని గుద్దిచెప్పాడు.

బ్రాహ్మణులకు బెట్ట ఫలముగల్దని యండ్రు
కుక్కలకును బెట్ట కొదువయేమి
ఇందునందును జీవుడొక్కడే యందురు

---

2. వేమన పాశ్చాత్యులు - నార్ల - 23 పేజి,
(పరిచయము)

తత్వజ్ఞానము, లోకజ్ఞానములేని, శుంఠలు జన్మనుబట్టి బ్రాహ్మణులుగా చలామణి అవడాన్ని నిరసించాడు. పొట్టపొడిస్తే అక్షరం రాని నిరక్షరకుక్షులు, శాస్త్రి, శర్మ, ఆచార్యులవంటి (కులం) బిరుదులు పేరుకు తగిలించుకొని అగ్రకులాలమని విర్రవీగడాన్ని తీవ్రంగా గర్హించాడు.

బ్రాహ్మణుల మటంగ్రడు బ్రహ్మత్వమదిలేని
బ్రహ్మమద్దియేల ? బ్రాహ్మణుడటె ?
బొమ్మవలెనువాడు దిమ్మపై గూర్చుండ

కులం పేరుతో మనుష్యులను పశువులుగాచూస్తూ, మానవత్వాన్ని కర్కశత్వానికి బలిఇచ్చి, శూద్రులదగ్గర దానంపుచ్చుకో గూడదనే సూత్రాలు వల్లిస్తూ — పొద్దునలేచి శూద్రజమీందారులకు ఊడిగం చేస్తున్నవారినిచూసి —

కులము గలుగువాడు గోత్రంబు గలవాడు
విద్యచేత విఱ్ఱవీగువాడు
పసిడిగల్గువాని బానిసకొడుకులు

అని దుయ్యబట్టాడు. ఎవడికి డబ్బుంటే వాణ్ని స్తుతిస్తూ, నుతిస్తూ, కీర్తిస్తూ, బ్రతికేవీళ్ళు, ఏకులంవాళ్ళు రాజులైతే వాళ్ళని ఆకాశానికిఎత్తి, వాళ్ళు శూద్రులైనా మీది చంద్రవంశము, సూర్య వంశము అని పొగిడి పొగిడి, మాన్యాలు, దానాలు గ్రహించి రోజు కొక ధర్మాన్ని పొట్టకూటికోసం చెప్పుకుంటున్న ఈ మాట తిరుగుడు గాళ్ళను —

మాలమాలగాదు మహిమీదనే ప్రొద్దు
మాటదిరుగువాడు మాలగాక
వాని మాలయన్నవాడెపో పెనుమాల —

అని అనగలిగాడు

"ఔషధంబులేని అస్పృశ్యతా జాడ్యం" దేశానికి దీర్ఘరోగంగా తయారయింది. ప్రకృతి విరుద్ధమైన ఈ కృత్రిమ వ్యవస్థలో అంటరానితనం ఒక అభేద్యమైన ఆచారంగా పరిణమించింది. వారిని ఊరికి దూరంగా వల్లకాటికి దగ్గరగా ఉంచారు. మూతికి ముంత మొలకు తాటాకు కట్టి వీధుల్లో తిప్పారు. అంత్యజుడని, చండాలుడని, మాలవాడని, మాదిగవాడని, బిరుదులతో నీచంగా పిలిచారు. అందుకే వేమన —

"మాలవానినేల మరిమరి నిందింప
నొడలి రక్తమాంసమొకటిగాదె"

అని ప్రశ్నించాడు.

యాగాల పేరుతో అన్నిరకాల జంతువులకొవ్వునుతిని. జంతువుల ప్రాణాలు హరించారు. అంటరానితనం పేరుతో మనుష్యుల నెత్తురు జుర్రి వాళ్ళ జీవాన్ని హరించారు. ఆచారం పేరుతో మానసికంగా మనుష్యులను చంపారు. అలవాటు పేరుతో ఇప్పటికి తింటున్న నెయ్యి కూడ క్రొవ్వే, దాన్ని మించిన మాంసాహారం ఏమిపుంటుంది. ఇంత మలిన హృదయులైన వీళ్ళు, మాలలు మాంసంతినడంవల్లనే వారిని వెలివేశాం అంటున్నారు. ఆ దృష్టితో చూస్తే వీళ్ళు పెనుమాలలు కారా? అని ప్రశ్నిస్తున్నాడు.

మాల మాంసముదిన మహిమీద జనులెల్ల
కొవ్వుతావలేదొ కోర్కెదీర
కులములన్ని ఒక్కకులముగా దెలియుడి

హింసజేయకుంట యేముఖ్యధర్మంబు
అనక హింసజేతు రవనిసురులు
చావు పశువుదినెడి చండాలుడే మేలు

వానితలమీద పులిమిన పంకిలమును కడిగి కరుణింపలేదయ్యో గగనగంగ' భారతదేశంలోని ఏపుణ్యనదీ జలాలకుకూడ అంటరానివాని

కులం బురదను కడిగివేసేశక్తిలేదు. పవిత్ర గంగానదికూడ వాడు మునగడం వలన అపవిత్రం అవుతుందేకాని వాణ్ని పవిత్రంచేయలేదు. ఇంత దౌర్భాగ్యాన్ని వాడి మెడకు చుట్టిన 'నరపశువు'లు నీణ్ని అంటుకున్న పాపానికి నీళ్ళలో మునుగుతున్నారు. అందుకే వేమన

మాలవాని నంటి మరినీళమునిగేరు
మాలకర్మచేత మాలడయ్యె
ఏల తెలియలేదొ యీ నరపశువులు.

అని హెచ్చరించాడు.

వైదికకాలంనుండి గోమాంసాన్ని భుజించింది పురోహితవర్గం స్వీయ ఆహారార్థం గోవులను వధించారని, గోమాంసభక్షణ చేశారని ఋగ్వేదంలోనే ఉన్నది. ఋగ్వేదంలోని ఒక రుక్కులో ఇంద్రుడు నాకోసం యజ్ఞులు 15 వృషభాలను వండుతారు, అంటాడు. మరొక చోట అగ్నిదేవునికి గుర్రాలు, ఎద్దులు, వట్టిపోయిన ఆవులు పొట్టేళ్ళు బలిఇవ్వబడ్డాయని చెప్పబడింది.

ఐతరేయ బ్రాహ్మణంలో చెప్పిన కామేష్టియజ్ఞంలో గోవృషభాలను బలిఇవ్వడమే కాకుండా, ఏయేదేవతలకు ఏయేరకమైన గో వృషభాలను బలియివ్వాలోకూడ వుంది.

అంతేగాక అతిథివచ్చినప్పుడు గోవును చంపడమనేదికూడఉంది. అందుకే అతిథిని గోఘ్నుడు అన్నారు (అతిథిగా వచ్చి గోవును చంపించువాడు)

కోసలరాజు చేసిన యజ్ఞంలో 500 ఎద్దులు, 500 లేగదూడలు. ఇంకాఎన్నో మేకలు, గొర్రెలు, పొట్టేళ్లు బలిఇవ్వటంకోసం యూపస్తంభంవేపు నడిపించబడ్డాయి. అని సంయుతనికాయంలో వర్ణించబడింది,
(అస్పృశ్యులెవరు — 103 పేజి)

ఈవిధంగా జీవహింసచేస్తూ — అన్నిరకాల మాంసాలను భుజిస్తూ వచ్చి, బౌద్ధమతానికి దడిసి మానివేసిన ఈ పెద్దలు గోమాంసము తింటున్నారు అనేపేరుతో అస్పృశ్యతను పాటిస్తూ జీవహింసచేస్తు న్నారు— అందుకే వేమన....

జీవి జీవి జంపి జీవికి వేయగా
జీవి వలన నేమి జిక్కి యుండె
జీవహింసలకును జిక్కునా మోక్షంబు —

అని ప్రశ్న వేశాడు

"అహింసా పరమోధర్మః" అనుసూక్తిని వల్లిసూనే జీవహింస చేయడాన్ని వేమన సహించడు.

వేమన చరాచరాత్మకమగు సకలప్రపంచము నందలి సమస్తజీవ కోటుల సుఖదుఃఖములను తనవిగా భావించుకొని యనుభవించిన మహా నీయుఁడు. అతడు తనకొఱకు తన యాలుబిడ్డలకొఱకుఁ బరితపించిన వాఁడుకాఁడు ఈ విశాల సృష్టియందలి జంతుజాలముల మంచిచెడ్డలను, సుఖదుఃఖములను బాగుగా పరికించి, విమర్శించి యాత్మానుభవమునకుఁ దెచ్చికొనినవాడు. అహింసకంటెఁ బరమధర్మము లేదను సూక్తిని గ్రహించి; నోరులేని జీవములయెడ నీ ప్రపంచమున జరగున్యాయమును హింసలనుగని యపార పరితాపమునకు గుఱియైన జీవకారుణ్యమూర్తి"[3]

అందుననే —

జీవి జంపు టెల్ల శివభక్తి దప్పుట
జీవి నరయ నిజము నీవెఱుగవె
జీవుఁడు శివుఁడగుట సిద్ధంబు

---

3 వేమనచరిత్ర — బండారు తమ్మయ్య (పేజి — 100)

గీ॥ జీవి జీవిఁ జంప శివునిఁ జంపుటె యగు
జీవుఁడరసి తెలియఁ శివుఁడెకాదె
భావమందు వేగఁబరికించి చూడరా

ఇట్టి జీవహింసలుచేసి వారు చెందెడు ఫలములను అవహేళనపూర్వకముగా —

గీ॥ పేరు సోమయాజి పెనుసింహబలుఁడయా
మేకపోతుబట్టి మెడనువిఱుచు
గాక క్రతువువంక గలుగునా మోక్షంబు

సోమయాజి బట్టి సొర్ల వేవెనురంభ
మనసు తీర్చునపుడు మమతతోడ
క్రతువు నేయుఫలము కల్గెరా చేసేత

అని క్రతువుల మర్మాన్ని విప్పిచెప్పాడు.

వీరశైవులు ప్రబోధించిన ఏకపంక్తి భోజన సిద్ధాంతాన్ని బ్రహ్మనాయుడు బోధించిన 'చాపకూటి' సిద్ధాంతాన్ని, ఈతడు ప్రబోధించాడు.

ఉర్వి వారి కెల్ల నొక్క కంచము బెట్టి
పొత్తు గుడిపి కులము పొలయజేసి
తలను చెయ్యిబెట్టి తగనమ్మ జెప్పరా...

ఈ సిద్ధాంతాన్ని ప్రబోధించి మనుష్యులందరిని ఐక్యం చేయడానికి ఎందరో ప్రయత్నించారు. గురునానక్ 'ఒకే లంగరులో వండిన దే అందరూ భుజించాలని శిష్యులకు చెప్పినా, గోరాగారు సహపంక్తి భోజనాలను ఆచరణద్వారా ప్రచారంచేసినా, వామపక్షాలవారు ఒకే 'కమ్యూన్'లో ఆరగించాలని నియమంపెట్టినా, ఇవన్నీ కులాచారాలు నిర్మూలించి మానవులను ఐక్యం చేయడానికే; కుల, ఆచార, సంప్రదాయ రహితమైన మానవసమాజాన్ని నిర్మించడానికి వేమన శాయశక్తుల కృషిచేశాడు. అందరికి ఆకలిఒకటే కాని తిండి వేరు.

"జాతి నీతి లేక, జన్మమ్ము లొక్కటి
అరయ తిన్న వేరె ఆకలొకటి"
అని గ్రహించాడు

ఒకరకమైన జంతువుల్ని తినేవారు ఇంకొకరకమైన జంతువుల్ని తినేవారిని ద్వేషిస్తారు. అది పరిశీలించి వేమన-

కసవు తినెడి వాని పసరము తినువాని
మాలయంద్రుగాని మహిని జనులు
పంది కోడి దిన్న ప్రాజ్ఞుల టందురా?

అని మాలలు తినే పసరం కనీసం గడ్డితింటుంది. ప్రాజ్ఞులుతినే పందులు, కోళ్ళూ, అశుద్ధాన్ని తింటాయి. ఎవరు పరిశుద్ధులు, ఆకలి తీరడానికి ఇద్దరు ప్రయత్నించారు. కాని ఈ ఆహారం పేరుతో - శాకాహారి మాంసాహారిని, మాంసాహారి మర్ల ఆవుల్ని గేదెల్ని తినే వారిని ద్వేషించడం వివేక శూన్యమని ప్రబోధించాడు.

కులం పునాదుల్ని పెకిలించడానికి బలంగా పలుగువేసిన వేమన అభేద్యమైన ఆ ఉక్కుపునాదుల్ని ఒక్కపూపు వూపాడు. సమాజంలో ఉన్న దురాచారాన్ని దురహంకారాన్ని దుర్మార్గాన్ని ఉతికివేయ దలచుకున్నాడు. ఈ మురికిని పిండాలంటే బండకేసి బాదకతప్పదని గుండెలమీద గుద్దక తప్పదని తెలిసికొని-

చాకి కోకలుదికి చీకాకుపడ చేసి
మైలదీసి లెస్సమడిచినట్లు
బుద్ధి చెప్పువాడు గ్రుద్దితే మేలయా.

అంటున్నాడు. ఆచారాల సంప్రదాయాల మురికితో స్వచ్ఛమైన యీ మానవ సమాజము దాని వ్యక్తిత్వాన్ని కోల్పోయింది.

తమభుక్తికోసం దినాలు, తద్దినాలు, మాసికాలు, ఇత్యాది శ్రాద్ధకర్మల్నీ, చచ్చినవాళ్ళకి వేసే పిండాల్నీ, పాత్రర్ల బ్రాహ్మల్ని గూర్చి వేమన ఇలా అంటున్నాడు.

"పిండములనుజేసి పితరుల తలపోసి
కాకులకును పెట్టు గాడ్దెలార;
పెంటతినెడి కాకి పితరుడెట్లాయెరా?

ఈ ప్రశ్న చార్వాకు లేనాడో వేశారు. ఈలోకంలో పెట్టిన పిండాలు అసలు పైకెట్లావెళతాయని వాళ్ళు ప్రశ్నించారు.

గచ్ఛతామిహ జంతూనాం వ్యర్థం పాథేయకల్పనమ్
గేహస్థ, కృత, శ్రాద్ధేన, పథి, తృప్తిరవారితా

చచ్చిపోయినవాడి పేరుతో బ్రాహ్మణునికి పిండము పెట్టినట్లుగానే పొరుగూరు వెళ్ళినవాడి పేరుతోగూడ బ్రాహ్మణునికి పిండము పెడితే దారిబత్తెములేకుండ వాడికి కడుపు నిండాలికదా? అని ప్రశ్నించారు.

అంతేగాక యజ్ఞయాగాల బండారాన్నికూడ తూర్పారబట్టాడు

ఆలిరంకు తెలుప నఖిలయజ్ఞంబులు
తల్లిరంకు తెలుప తద్దినాలు
కానితెరువు కర్మకాండ కల్పితమాయె"

అని విడమర్చాడు, "యజ్ఞయాగాలు చేసేటప్పుడు యజమాని భార్య, తాను వ్యభిచరిస్తే ఎన్నిసార్లు ఎవరితో పోయినది సూచించ డానికి అన్ని గడ్డిపోచలను పెట్టాలి. తద్దినాలలో పేరుకు తండ్రి ఎవ డైనా జన్మయిచ్చిన వాడెవడో వాడికే పిండం చెందుతుంది. కట్టుకున్న భార్య రంకూ, కన్నతల్లి రంకూ బయటపెట్టించే కర్మకాండ దుర్మార్గమే. ఇలాంటి ఎత్తిపొడుపులు పొడవకపోతే జ్ఞానోదయంకాదు

ఇలా గుద్ది చెప్పకపోతే ఫలంలేదు. 'బుద్ధి చెప్పువాడు గ్రుద్దితేమేలయా' అని అందుకే వేమన్నగారు కచ్చితంగా చాటుతున్నారు."[5]

ఈ విధంగా జంతు హింసాత్మకమేగాక హీనమైన కార్యములతో కూడిన ఈ యాగములను దుయ్యబట్టాడు.

ఈ విధంగా సామాజిక విప్లవాన్ని లేకెత్తించిన మొదటి కవి వేమన అనుటలో అత్యుక్తి లేదు.

వేమనకు ముందున్న తెలుగు కవుల భావనాసీమ చాలావరకు సంకుచితము వారు పూర్వాచార బద్ధులు, రాజులకు, అగ్రవర్ణాలకు జేజేలుపలికి రాచరికపు వ్యవస్థానియంతృత్వానికి వంతపాడారు. వ్యక్తిత్వాన్ని అమ్ముకొని పొట్టపోసున్నారు. స్వతంత్రభావనాసీమలో విహరించే ధైర్యంలేక చచ్చు మత సంప్రదాయాలకు ప్రచారకులయ్యారు. చాతుర్వర్ణ్యవ్యవస్థా పునాదులను గట్టిపరచారు. ప్రతికావ్యంలో నాలుగు వర్ణాలని విడివిడిగా ప్రత్యేక ధర్మాలతో వర్ణించి, వర్ణసంకరం కాకుండా పరిపాలించురాజే గొప్పవాడని ఊదరగొట్టారు.

సమకాలీన సమాజదౌష్ట్యాన్ని ఎదిరించి ప్రశ్నించే మనస్తత్వం వారిలో లేకపోయింది. పూర్వాచారాల్ని, ధర్మాల్ని, పద్ధతుల్ని, ప్రశ్నించడం అపరాధంగా వారు భావించారు, శబ్దసౌభాగ్యం, కవితావ్యాసములకు వారు పెన్నిధులేకాని, స్వేచ్ఛాపూరిత భావప్రకటనముచ మాత్రం వారు భీరువులు.

అందుకే ఈ వ్యవస్థలో ఉన్న సాంఘిక అస్తవ్యస్తతల మీద గుండెచరచి ప్రశ్నించిన మొదటి తెలుగుకవి వేమన.

ఇంతటి మహత్తరమైన విప్లవకవితామూర్తిని 1914 వ సంవత్సరము వరకు ఆంధ్రపండితలోకము కవులచరిత్రలోగాని విమర్శలలో

---

5 వేమన్న వేదం ఆరుద్రవ్యాఖ్య పేజి 15

గాని బయటకురాకుండ తొక్కిపట్టినది. తెనుగులో మొదటి వాఙ్మయ చరిత్రకారులైన గురజాడ శ్రీరామమూర్తి శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారలు వేమన ప్రస్తావనే తేనేలేదు అంటే ఎంత విచిత్రమో ఆలోచించండి. అనామకులైన వేములవాడ భీమకవంటి కవులందరినో పేర్కొంటూ 220 మంది జీవితచరిత్రలు రచించిన కందుకూరి, వేమన పేరు తలంచక పోవడం శోచనీయమైన విషయం.

ఇది ఈనాటి విషయంకాదు[6] అప్పకవిలాంటి లాక్షణికులు శూద్రుడు పాయసమువంటి రచనచేసిన అదికాకి ముట్టుకున్న పాయసమే కాని పరిశుద్ధమైనదికాదు అని ఆనాటినుండి ఈసడించుచునే వచ్చారు. ఎందరో వేమన్నలు వీరి ఉక్కుపాదాల క్రిందపడి అణగద్రొక్కబడినా రనేది సత్యం. ఏది ఏమైనా వేమన్నను తెలుగులో గుర్తించినది. పాశ్చాత్య పండితులే, చార్లెస్ ఫిలిప్ బ్రౌన్, హెన్రీ బ్యూచాంప్, జె. ఎ. దుబాయ్; ఆర్. ఎం. మ్యాక్ డొనాల్డు; ఛార్లెస్, ఇ. గోవర్; విన్ సెంట్‌స్మిత్; విలియం హోవర్డుక్యాంబెల్; లాయనెల్ డేవిడ్ బార్ నెట్; హెన్రీబవర్స్; జె. పి వి. గ్రిబిల్ మొదలగు ప్రసిద్ధ విమర్శకులు.

వేమన కవిత్వతత్వమును, తాత్విక విధానమును, వైష్ణవ్య పథమును అనేక కోణాల్లో విశ్లేషించి ఆంధ్రదేశమునందేకాక యావత్ భారతీయ సాహిత్యంలో ఆయనకు సముచిత స్థానం కల్పించారు. తరువాత తెలుగు విమర్శకులలో శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి

---

6. ఉపమగల్గిన శయ్యల నొప్పియున్న
సంకరుని కావ్యంబు గ్రాహ్యంబుగాదు
పాయసంబైన, సంస్కారపక్వమైన
కాకజుష్టంబు హవ్యంబు గానియట్లు.

శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ శ్రీ బండారు తమ్మయ్య శ్రీ నార్ల వెంకటేశ్వరరావు శ్రీ మరుపూరి కోదండరామిరెడ్డి శ్రీ ఆరుద్ర మొదలగువారు వేమన్నను వేమన్న తత్వమును ఆంధ్రపాఠకలోకమునకు నివేదించారు.

అందుకే కులంపేరుతో అగ్రవర్ణాల జగన్నాధ రథచక్రాలక్రింద నలిగిపోయిన ఎందరో వేమన్నలకు ప్రతినిధిగా నిలబడి ఈ వేమన్నకు ఈ కులం పురాణాలు అంకితం చేశాను.

# కవిరాజు భావవిప్లవం

కవిరాజు త్రిపురనేని నిర్భీతిగల ఆలోచనాపరుడు. సంస్కర్త, భావవిప్లవకారుడు. సాంఘిక అన్యాయాన్ని ఎదిరించాడు. స్త్రీ హాని సత్యాన్ని నిర్మూలించ యత్నించాడు. విగ్రహారాధనను దుయ్యబట్టాడు. దేవుళ్ళ పేరుతో దోపిడిని, కర్మసిద్ధాంతాన్ని, వెట్టిమొట్టి ఆచారాల్ని జంతుబలుల్ని, ప్రశ్నించాడు. అంధవిశ్వాసాలను, దుష్టమతాచారాలను అభ్యుదయ నిరోధక భావాలను ఖండించి, భావవిప్లవమును చేకెత్తించాడు.

మానసిక వికాసాన్ని కోరుతూ, సంఘ పురోగతిని కాంక్షిస్తూ, నవ జీవనాన్ని లక్షిస్తూ, ఆశయాల సాధనకై కవిరాజు ఉద్యమం నిర్వహించాడు. పాతఛాదస్తాన్ని పారద్రోలాడు. తన సిద్ధాంతాన్ని గద్యంలో, పద్యంలో, ప్రబంధాల్లో, నాటకాల్లో, శతకాల్లో, సూత్రాల్లో, పురాణాల్లో, భాష్యాల్లో హేళనగా, లాలనగా చెప్పాడు. వజ్రాయుధంవంటి కవిత్వం సహాయంతో పురాణాలను, పురాణ పురుషులనూ, వాటికిదత్తమయిన మనసులనూ, కకావికలు చేసాడు.

గ్రహణశక్తిఉన్న పురాణవ్యాధి పీడితుల జాడ్యాలు నయంచేసి పునరు జ్జీవితులను చేశాడు. అందుచేతనే భావవికాసంలోకాని, తెలుగు కవితలోకాని కవిరాజు తెలుగునాటి కొక యుగపురుషుడు.

ఆయన చారిత్రక దృష్టికోణము, శాస్త్రీయదృక్పథము, కర్మ కాండనిరసన, అంధవిశ్వాసములపై దాడి, హేతువాదుల మేధస్సులను చైతన్యవంతం చేశాయి. కవిరాజు భారతావనిలో కులధర్మం మానవతను నాశనంచేసి మానుషత్వాన్ని చంపుచున్నప్పుడు, మత ధర్మాన్ని, కులధర్మాన్ని నిలదీసి అడిగిన ధీరుడు. పురాతన పురాణౌఘ మ్ముకు చెండాడి సూతునిచే మానవధర్మాన్ని ప్రవచింపజేసిన నూత్న భాష్యకారుడు. కులగోపుర ద్వారకవాటముల వ్రయ్యలు చేసినవాడు.

ఈ మానవధర్మ ప్రతిపాదకుడైన "త్రిపురనేని" త్రైవర్ణికులు గాని మనుజులు మనుజులుకారు. ద్విపాదపశువులు. ఈ వాక్యములు వ్రాసిన వాని కన్నను మానవపిశాచు లెందైనను నుందురా? మనుష్య ధర్మము కొంచెమైన వీరి యందున్నదా?" అని ప్రశ్నించిన హేతు వాది. భగవద్గీతలో బాలచంద్రుడు బ్రహ్మనాయుని ప్రశ్నింపగా బ్రహ్మనాయని ముఖమున త్రిపురనేని వర్ణధర్మాన్ని వివరించాడు.

బాలచంద్రుడు _

"కులధర్మ వర్ణ ధర్మం
బులు కలవనుమాట పుణ్యపురుషా నిజమే!
కలిగిన నా యా ధర్మం
బులకుం గల తారతమ్యమును జెప్పగదే!"

అని అడుగగా, బ్రహ్మనాయుడు ఈవిధముగా వివరించు చున్నాడు.

ఒక కులమున కొక ధర్మం
బొక వర్ణంబునకు వేఱే యొకధర్మము త
ప్పక కలవని చెప్పెదు వా
నికిఁ బురుషార్థములు గలుగనేరవు పుత్రా!"

అని కుటిల న్యాయశాస్త్రజ్ఞుడైన కౌటిల్యుని, కులధర్మ ప్రవక్త యైన మనువును తూర్పారపడుతున్నాడు. వర్ణసాంకర్యాన్ని గూర్చి బ్రహ్మనాయని ముఖమున బాలచంద్రునితో ఏమంటున్నాడో చూడండి

సంకరులు నెంతమంది సజ్జనులు కలరొ
పూజ్యులున్నారొ యెరుగవే పుత్రనీవె
అంటుమామిడిపండ్లు రుచ్యములుగావె?
యెవరు బోధించినారు నీకీవిధంబు

మానవ పరిణామక్రమంలో జాతి వర్ణం కులం నిన్నగాక మొన్న వచ్చినవి వీటిని సాక్షాత్తు ఆ దేవుడే సృష్టిచేశాడు అనే శుష్క వచనాలు, చారిత్రకగతి తెలిసిన బుద్ధి జాడ్య జనితోన్మాదుల మాటలు అని వర్ణవ్యవస్థను సమాజ పరిణామరీత్యా వ్యాఖ్యానించి

"ఈ పరిణామ వాదమును నెవ్వడు నమ్మక మూఢబుద్ధినా
మూపుననుండి యొక్కరుడు మోముననుండి యొక్కడు తక్కువ
రాపయి నాదు గజ్జలను హజ్జలబుట్టిరి యంచుఁజెప్పునా
పాపికి ముక్తిచేపడదు బాలుడ! జన్మములెన్ని యెత్తినన్".

అని శపించాడు. ఈ సమాజ పరిణామ వాద సమర్థనతో
"చాతుర్వర్ణ్యం మయాసృష్టం

"గుణకర్మ విభాగశః" అని అర్జునునికి గీతోపదేశం చేసిన శ్రీకృష్ణ పరమాత్మకూ,

"బ్రాహ్మణోఽస్యముఖమాసీత్ బాహూరాజన్యః కృతః
ఊరూత దస్యయ ద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రో అజాయత"

అన్న ఋగ్వేద పురుష సూక్త ఋక్కుకూ కలిపి ఒక్కసారే గోరీ కట్టాడు.

నరులందరికి ఒకేధర్మం. ఒకేన్యాయం ఉండాలి. భిన్నధర్మాలు, భిన్నకర్మలు మనుష్యుల కేర్పరచి; మనుష్యుల జీవన విధానాన్ని భిన్న పాయలుగాచేసి మానవ సంఘాన్ని కులసంఘంగా నిర్మించిన వారిని "ధూర్తచిత్తులు''గా దుయ్యబట్టాడు.

బాలచంద్రుడు వర్ణసంకరం వలన జాతిధర్మం భ్రష్టంకాదా ? అని ప్రశ్నించగా —

అక్షమాలకు శక్తిమహామునీంద్రు
డవతరింపలేదె కుంభ భవునివల్ల
నందుచే వసిష్ఠుఁడు నిరయంబుఁగనెనె?
శక్తి పతితుఁడయ్యెనె యార్యశప్తుఁడగుచు"

అరుంధతికి వసిష్ఠునివలన పుట్టినశక్తి మహామునికాని, వసిష్ఠుడు కాని పతితులయ్యారా? వర్ణసంకరులైన వసిష్ఠుడు; శక్తి రాజులచేత సర్వమునిలోకంచేత కొనియాడబడ్డారుగదా! అసలు హిందూధర్మ కర్తలలో పెక్కుమ వర్ణసంకరులేగదా! అసలు "నేడు భారతభూమిలో నిలచియున్న వర్ణముల సంకరముగాని వర్ణమొకటిగూడ లేదని'' నిగది స్తున్నాడు. భారతదేశ చరిత్రనొకసారి సింహావలోకనం చేసుకుంటే; ఈదేశానికి దండెత్తివచ్చి రాజ్యాలు స్థాపించుకున్న పెక్కు ఇతర దేశీయజాతులు ఇక్కడ పై వర్ణాలతో వియ్యమందినవే. భారతదేశం లోని ఏఒక్కడు నాది వర్ణసంకరంకాని జాతిఅని గుండెమీద చేయి వేసుకొని చెప్పలేడు. అసలు మానవులందరూ ఒకేజాతి. ఇందులో సంకరమేమిటి ఇకవర్ణాలుగా జాతులుగా విడిపోయినప్పుడే సంకరమనే ప్రశ్నవస్తుంది. అందుకే కవిరాజు :

"ఒక్క జాతియందుద్భవ మొందిగూడ
స్పర్శ దోషంబు, దృష్టిదోషంబటంచు
పతితమై పోవుచుండె ప్రభ్రష్టమగుచు
తెలుగుజాతి పునస్సృష్టివలదె చెపుమ"

అంటూ; మానవతా వృక్షానికి పట్టిన వర్ణవ్యవస్థా విషపురుగు ఏమందుకి పోయేటట్లుగా లేసవ్వాడు ఆచెట్టునే తొలిచేసి కొత్త చెట్టు నాటాల్సిన పనిలేదా ? పాతను సమూలంగా నిర్మూలించి కొత్తభావాల సుమాలు గుబాళించు మానవతా ఆరామాలు నిర్మించాలంటాడు. అందుకే నూతన వేదాన్ని జవంజీవం పూన్చి వినిపించాడు. మానవుల మేల్కొలిపాడు. సమకాలీన కవి వరేణ్యులలో పెక్కురు దేశభక్తి కవితతో దేశీయమైన కుసంస్కృతిని భజంత్రీలై పొగడుచున్నపుడు— కొందరు రామాయణ విషవృక్షాలకు పాదులుచేసి నీరుపోస్తున్నప్పుడు, కొందరు భావకవితా విహాయసంలో విహరిస్తున్నపుడు ఈ కవితా వతంసుడు ఒక్కడే గుండెదిటవుతో మానవతా మహాయజ్ఞానికి పూనుకొని, పాతభావాల నిర్మూలన కవసరమైన మానసిక వాతావరణాన్ని సృష్టించడానికి సాహితీ విప్లవధ్వజమెత్తాడు. నూతనసాహితీ ప్రపంచాన్ని సృష్టించాడు. అందుకే భారతంలో వర్ణవ్యవస్థను ప్రబోధించిన వ్యాసుని నిలవేసి అడుగుచున్నాడు —

"తనగతి యెఱుంగకయె వ్యాసమునివరుండు
పల్కెనీ కొఱమాలిన పల్కులెల్ల
దానెవడు సంకరుఁడుకాడె ? తనకురాని
నియమ మితరులకేగతి నరుగదెంచు?"

ఈ పనికిమాలిన వర్ణవ్యవస్థను ప్రోత్సహించిన వ్యాసునకు కులముందా ? ఆయన సంకరుడుకాడా ? తనకులేని నియమములు

ఇతరులకెట్లు వర్తిస్తాయి? మానవమైజాన్ని వర్ణం పేరుతో చంపడం సాధ్యమా? శక్తిగల మానవుణ్ని ఏ ధర్మాలు, నియమాలు అడ్డుకో లేవని చరిత్ర చాటిచెబుతూనే ఉందికదా!'' అని సూటిగా ప్రశ్నిస్తున్నారు. ఈ విధంగా 'సాంఘిక న్యాయం' మృగ్యమైపోయిన స్థితిగతులను చూచి ఆక్రోశించింది కవిరాజహృదయం. ఆర్షధర్మ రసాయనమనే పాత పానీయాన్ని క్రొత్తసీసాలలో జిగేలుమనిపించేటట్లు ఉంచే ఆర్షధర్మ ప్రతిష్ఠాపకుల ప్రభావం సంఘంమీద ఎంతగానో ఉంది. ఆ రామాయణ, భారతాదులను ఇప్పటివరకు కవులు, గాయకులు, నాటక కర్తలు, హరికథలవారు, బుర్రకథలవారు, జక్కుల కథలవారు, జముకుల కథలవారు, త్రిప్పి త్రిప్పి వ్రాస్తూ కూస్తూ; ఆడుతూ పాడుతూ ప్రజా హృదయాలమీద ఆ చెత్తభావాల చిత్రాలు గీస్తున్నారు.

"పాయక పూర్వగాథలని ప్రత్నకవీంద్రులు నేటిదాక, రా
మాయణ భారతాది కృతులన్నియు వ్రాసిరి త్రిప్పి, త్రిప్పి యే
దో యొక కబ్బమంచు దలకొక్కటి యక్కట! నూతనాంశ మే
దో యొకటేనియుం దెలుపనోపని గ్రంథ సమూహమేటికో."

అని రామాయణంలోని అనౌచిత్యాలను, అస్తవ్యస్తాలను కవిరాజు ఎత్తిచూపాడు. పురాణాల్లోని ఘోరవిరుద్ధగాథలను, అసంబద్ధతలను విమర్శనాత్మకదృష్టితో సూతపురాణంలో చిత్రించాడు కవిరాజు.

కులం పేరుతో రాముడిచేత చంపబడ్డ శంబూకుని గూర్చి "శంబుకవధ" అనే కావ్యాన్ని వ్రాసి బ్రాహ్మణ రాచరిక వ్యవస్థల దుష్టక్రౌర్యాన్ని చిత్రించాడు. అందుకే భగవద్గీతలో-

"తొలుతలేవు నేఁడు కలవెచ్చు లొచ్చులు
హేతువేమొసుంత యెఱుఁగరాదె
యిటులు స్వార్థపరులు సృష్టించినారలు
తెలియఁగోరు దేని దెలియఁబఱతు."

అని సాంఘిక వ్యవస్థలోని అస్తవ్యస్తతకు మూలాన్ని అన్వేషించాడు. కనుగొన్న సత్యాన్ని ప్రకటించుటలో గుండెదిటవు కలవాడై తన మృదుమధుర కవితానాదంతో ఎలుగెత్తిచాటాడు. కావుననే 'క్రొత్త సత్యనారాయణచౌదరి'గారు కవిరాజును గూర్చి ఇలా అన్నారు. ఆయన "పండితులలో పండితుడు, విమర్శకులలో ప్రాగ్రసరుడు, సంస్కర్తలలో శిరోమణి, కవులలో పూర్వకవులను మరపింపజాలిన మేటికవి. ఆత్మగౌరవమును కాపాడుకొనుటలో అందె వేసిన చేయి. కాసుపీసములకు, గ్రాసవాసములకు ఎత్తువారి చేతి బిడ్డలగు విత్తవంతుల పంచలను పడిగాపులు పడి తిరుగుదేబెల కీతడు కుఠారమువంటి ధీరుడు." కవిరాజు హేతుదృష్టితో మానవచరిత్రను, ప్రపంచ చరిత్రను, తాత్వికపథాన్ని అధ్యయనం చేసి స్వార్థపరులచే కల్పించబడి అభేద్యంగా చిట్టం కట్టుకుపోయిన కులవ్యవస్థ పునాదుల్ని గట్టిపరచిన అగ్రవర్ణాలపై ధ్వజమెత్తాడు. ఎన్నియో వర్ణాంతర వివాహాలు నిర్వహించాడు. తన సిద్ధాంతాన్ని నార్లవారన్నట్లు "సభామండపాల నుంచి చెప్పారు. వివాహ వేదికల్నుంచి చెప్పారు. సూతాశ్రమం నుంచి చెప్పారు. రాజకీయ శిబిరం నుంచి చెప్పారు." అయితే ఎంతవరకు ఈ సామాజిక వర్ణవ్యవస్థా పునాదులు కదిలినాయి ? అంటే అది ఒక్క అంబేడ్కర్, ఒక్క వేమన్న, ఒక్క గురజాడ, ఒక్క త్రిపురనేని, ఒక్క రామమోహన్‌రాయలు, ఒక్క కేశవచంద్రసేన్, ఒక్క ఈశ్వరచంద్ర విద్యాసాగర్ కదిలితే, కదిలిస్తే ఈ పునాదులు కదలవు. వాళ్ళు ఈ పునాదుల నిర్మాణాన్ని వ్యాఖ్యా

నించ గలరు అంతే; కాని కదలాల్సింది, ప్రవహించాల్సింది నువ్వు, నేను, మనం, జనం, అంతా కదలాలి. ప్రవహించాలి. జనసంద్రం పొంగాలి. అప్పుడే నవసమాజ నిర్మాణం, నవరాజ్య స్థాపనం. అందుకే త్రిపురనేని–

మనకు ప్రేరణ
మనకు చైతన్యం
మనకు ఉత్సాహం
మనకు ఊపిరి,
ఆ ఊపుతో వెల్లువగా పొంగుదాం
పాతను ఊడ్చేద్దాం
కులరహిత సమాజం నిర్మించుదాం

